# ఆత్మగతం

రావూరి భరద్వాజ





**అంకితం**

మిత్రులు
ఎ. వైశంపాయన
గారికి



# 1

## ఛత్రపాణి

**పాత్రలు :**

కాలకుడు    ఇంద్రాణి

యశపాణి

ధర్మమూర్తి

చమనుడు

ఛత్రపాణి

ాలకుడు : మహారాజా! ఈ వేళ కాని వేళ వచ్చి, మీ విశ్రాంతిని భంగపరిచినందుకు క్షమించండి. ప్రభువులు యిప్పుడు విశ్రాంతి ననుభవిస్తుంటారని నాకు తెలియక పోలేదు. కానీ ప్రభూ, మరి గత్యంతరం లేకపోయింది.

పాణి : కాలకా! ఈనాడు నీ మాటలలో ఏదో విచిత్రం ధ్వనిస్తున్నది. అవును గదూ!

: కావచ్చును ప్రభూ ... నేను కాదనలేను...మీతో క్క విషయం మనవి చేసుకొందామని — యిలా కాని సమయంలో వచ్చాను. ఇంతకన్న అనువయిన వేళగూడా ఉండదేమో? మహారాజా ... మానవ జీవితానికి పరమార్థ మేమిటి? ఎందుకో జన్మించాము. ఎందుకో జీవిస్తున్నాము. ఏవేవో చేశాము. ఇంకెన్నెన్నో సాధించాలని ఆరాటపడుతున్నాము. కానీ ప్రభూ! వీటన్నిటి ఫలిత మేమిటి? చివరకు మిగిలే దేమిటి? జర ఆక్రమిస్తున్నది. రుజ ఆవేశిస్తున్నది. ఎప్పుడో అలా చనిపోతాము. చనిపో

తున్న ఆ క్షణంలో ఏమి సాధించామనే ప్రశ్నకు—మాన వుడు సంతృప్తికరమైన సమాధానం చెప్పుకో లేకపో తున్నాడు. లాభ నష్టాలను బేరీజు వేస్తే రెండూ సరిపో తున్నాయి. ఇది సాధారణంగా జరుగుతుంటుంది. కానీ ప్రభూ ... అందరివలె నేనుగూడా అలా తృప్తికరమైన ప్రత్యుత్తరం నాకు నేను యిచ్చుకోకుండా చనిపోలేను. అందుకోసమని —

యశ : (చప్పున అందుకొని) అందుకోసమని? అందుకోసమని నీ వేమి చేయబోతున్నావు సేనాపతీ ?

కాల : ఈ జీవితంమీద రుచి తప్పిపోయింది. ఇంతకన్నా ఈ బ్రతుకులో ఉండి—ఇంకేమీ సాధించలేనప్పుడు ఆ సాధనా ఫలం కోసం మరొక మార్గాన్ని అన్వేషించాలి. ఆ అన్వే షణా యత్నంతో నాకు సన్యసించటం కన్నా ఉత్తమ మైనది కనిపించలేదు. అందుకే నేను సర్వసంబంధాలనూ తెంచుకొని తపో భూములకు వెళ్ళదామనుకొంటున్నాను. మహారాజా! మహారాజా...! నాకు అనుజ్ఞ నిప్పించండి. నా వేడికోలును నిరాకరించకండి.

యశ: కాలకా! నీ ప్రార్థనను అంగీకరించ లేను. నిష్కారణంగా నీవంటి సేనాపతిని కోల్పోవడానికి నా మనస్సు ఇచ్చగిం చడం లేదు.

కాల : మీకు నా యందున్న విశ్వాసానికి కృతజ్ఞుణ్ని. ప్రభువు లన్నట్లు— నేను నిష్కారణంగా సన్యసించి నప్పుడు మీరు అంగీకరించక పోవచ్చును—కాని కానీ....

యశ : అయితే కారణమేమిటి కాలకా ? అప్పుల ఎడబాటా ? ధన నష్టమా ? లేక —

కాల : కాదు ప్రభూ! ఇటువంటి స్వల్పవిషయాలకు నేను చలించనని మీకూ తెలుసు. నా దారాపుత్రాదులు, అకాల మృత్యువాతపడినప్పటికీ విచారించను. ప్రభుప్రసాదితమైన నా యావత్సంపద చోరగ్రస్తమయినా నేను ఖేదించను. కానీ, కానీ మహాప్రభూ మీకే ఒక ఘోరాపద ప్రాప్తించ నున్నప్పుడు – నేను కన్నులతో చూస్తూ నిర్లిప్తంగా ఉండలేను. అందుకే సన్యసింప నివ్వండి, అరణ్యవాసిని కానివ్వండి.

యశ : (ఆశ్చర్యంగా) సేనాపతీ ఏమిటి నీవంటున్నది? నీ మాటలకు అర్థమేమిటి కాలకా?

కాల : (చిన్నగా నవ్వి) ప్రభూ...! మీ రెంత నిష్కల్మష హృదయులు...అందుకే మీ కెవ్వరిలోను దోషం గోచరించదు. అందరూ మీవలె...విశుద్ధ మనస్కులై ఉంటారని మీరు భావిస్తుంటారు. ఈ మీ మంచితనాన్ని ఆలంబనం చేసుకొని, దుష్టులు తమ కార్యాలను సాధించుకొంటున్నారు. ఏ కన్నులతో మీ వైభవోన్నతిని దర్శించానో, వాటితోనే మీ రాజ్యచ్యుతిని గూడా చూడమని నన్నెందుకు బలవంత పెడుతున్నారు ప్రభూ! నాకు అనుజ్ఞ నివ్వండి. నేను వెళ్ళుతాను.

యశ : కాలకా ఇది స్వప్నం కాదుగదా...నే నేదో భ్రమా జగత్తులో లేను గదా!

కాల : లేదు ప్రభూ !

యశ : ఎన్నడూ... ఎవ్వరి నోటివెంటా విననని మాటలు ఈనాడు నేను వింటున్నాను... ఏమిటి సేనాపతీ నువ్వంటున్నది? యశపాణి మహారాజుకు రాజ్యచ్యుతియా?

కాల : అతి మంచితనమెంత ప్రమాదమో తమరింకా గుర్తించినట్లు లేదు. పాపమని భావించి, దయతలచి, ధర్మమూర్తిని తమరు ఆదరించారు. యోగ్యతాయోగ్యతలను గూడా విచారించకుండా, పురోహితుణ్ని శాసనాలయాధ్యక్షుణ్ని చేశారు. తమ చల్లని ఆదరణను అనుభవించి, క్రొవ్వు పట్టి కృతఘ్నుడై దుష్టబుద్ధితో ఈనాడు ప్రభువుల వారినే పదచ్యుతుణ్ని చేయాలని ధర్మమూర్తి ప్రణాళికలు రచిస్తున్నాడు. ఈ కాశీరాజ్యాన్ని కైవసం చేసికొని, తమను చెఱసాలలో బంధించాలని వలలు పన్నుతున్నాడు. మహారాజా ... ఈ శరీరం మీ ఉప్పు పులుసులతో పెరిగినది. మీ సేవకే అంకిత మివ్వబడింది. కానీ మీరు చూస్తున్న దానినే విశ్వసించటం లేదు. నేనేమి చేయను? అందుకే సన్యసించదలచుకొన్నాను. అనుజ్ఞ నిప్పించండి.

యశ : (ఫక్కున నవ్వి) కాలకా నీ అనుమానాలకు ఉపపత్తులేమిటోయ్?

కాల : ప్రభూ నా మాటను విశ్వసించమని మిమ్ము వత్తిడి చేయను. అయినా ప్రభువులు సందేహించారు గనుక చిన్న ఉదాహరణ మిస్తాను. ధర్మ వేషధారులమై మనము రాజ్యమంతటా సంచరిద్దాము. ఎక్కడ విన్నా ధర్మమూర్తిని గురించిన ప్రశంసావాక్యాలే తమ కర్ణ గోచరమవుతాయి. ప్రభువుల ప్రసక్తి ఎక్కడా ఉండదు. అలా కాని పక్షాన ప్రభువుల కటారికి నా శిర మప్పగిస్తాను. అంగీకారమా ప్రభూ?

యశ : ఇందులో భయపడటానికేమీ లేదు కాలకా...ధర్మ మూర్తిని గురించి ప్రజలంత ఆ గుబ్బుగా ప్రశంసించటం – అది నన్ను ప్రశంసించటమే అవుతుంది.

కాల : ప్రభువుల మాటను నేనూ కాదనను. కానీ అది యథార్థప్రశంస కాదని నా మనవి. ఆ పొగడుతున్న వారందరూ, అతని అనుయాయులు. లక్షలాది ధనాన్ని వెదజల్లి అతను తన మంచితనమును గురించి ప్రచారము చేయిస్తున్నాడు. మీపై లేని పోని అపోహాలు రేకెత్తిస్తున్నాడు. విచక్షణాజ్ఞాన రహితులైన ఈ ప్రజ అతనికి జేజేలు కొడుతున్నది.

యశ : నిజమా సేనాపతీ! ధర్మమూర్తి ఇంతటి నీచానికి పాల్పడ్డాడా?

కాల : ఇంకా సందేహిస్తున్నారా మహారాజా! అదిగో అటు చూడండి. ఇలా ఇలా ప్రక్కకు రండి. ఈ జాలకపుటవనిక రొుత్తిగించి చూడండి.

(జనం గడబిడ, మధ్య మధ్య ధర్మమూర్తి గారికీ జై అనే నినాదాలు వినపడతాయి. పావునిమిషం తరువాత రొద దూరంగా వెళ్ళిపోయి తిరిగి యథాస్థితి ప్రశాంతత....)

కాల : మహారాజా వారందరూ ధర్మమూర్తి అనుయాయులు. అతని ఆజ్ఞ వారందరికీ అవశ్యశిరోధార్యము. ఇటువంటి వారిని దేశమంతట వర్పరచుకొన్నాడు ధర్మమూర్తి. అదనుకోసం ఎదురు చూస్తున్నాడు. తటిచూచి ఈ విష నాగు మిమ్ములను కాటందుతుంది. ఆపై మీ ఇష్టం.

యశ : సేనాపతీ! మహారాజునుగా కాక ప్రాణదాతవుగా నిన్ను అభినందిస్తున్నాను. నా కన్నులు తెఱచావు. కృత

జ్ఞుడిన్ని — ఇటువంటి స్థితిలో నన్నుంచి నువ్వు వెళ్ళటం ప్రభుభక్తి కాగలదా కాలకా?

కాల : ప్రభువులు ఇప్పుడు యథార్థాన్ని దర్శించారు. సంతోషం, ఇక కర్తవ్యాన్ని నిర్దేశించండి.

యశ : కాలకా! నా కేమీ స్ఫురించటం లేదు. నీవే తగు మార్గ మేదన్నా అన్వేషించు. నీకు సర్వాధికారాలనూ యిస్తున్నాను. ఈ విషనాగును ఏదో విధాన తుదముట్టించి, నీ ప్రభువు ఋణం తీర్చుకో కాలకా.

కాల : ప్రభువులు గురుతర బాధ్యతను నాకొప్పగించారు. నేనందుకు అశక్తుణ్నేమో.

యశ : కాదు సేనాపతీ, నువ్వు అశక్తుడవుకాదు. అశక్తుడవే అయితే, ఈ రహస్య వ్యూహాన్ని ఛేదించగలిగి ఉండవు. నీ మేధాశక్తిపై నా కపారమైన విశ్వాసమున్నది. ఏదో ఒక ఉపాయ మాలోచించు. వెంటనే ఈ ధర్మమూర్తిని—

కాల : రాజ్యాపహరణాసక్తునికి మరణ దండనాన్ని మన శిక్షాస్మృతి సూచిస్తున్నది ప్రభూ.

యశ : అపరాధాన్ని ఋజువుచేయటం అసాధ్యమేమో ఆలోచించావా కాలకా?

కాల : ప్రభూ! అపరాధారోపణం అంత కష్టంకాదు. మీరు ధర్మమూర్తిని, ఏకాంత మందిరానికి పిలిపించండి. ఫల పుష్ప భరితమైన తరులు, కుసుమశోభితమైన లతలతో పింపెసలారే ఒక ఉద్యానవనము? వనమునకు మధ్య భాగంలో సరస్సు; ఆ సరస్సుకు దాపున ఒక రమణీయ సౌధము—రేపటి ప్రభాతవేళకు నిర్మించమని ఆదేశించండి.

రేపటికే వాటిని నిర్మించటం అసాధ్యం. ఈ ఆజ్ఞోల్లంఘనను ప్రాతిపదికగా తీసికొని, మన మాతనిని శిక్షింపవచ్చు.

యశ : కాలకా, నీ నిశితబుద్ధి నా కాశ్చర్యాన్ని కలిగిస్తున్నది. వెళ్ళు. ధర్మమూర్తి శిక్షాచరణకై కావలసిన ప్రయత్నాలు ఏమిటో చూడు. నే నిప్పుడే అతనికి వార్త పంపుతాను...ఓరీ ఎవ రక్కడ? ధర్మమూర్తిని నా ఆజ్ఞగా ఏకాంతమందిరానికి తీసుకురండి.

(పాజ్)

* * *

ధర్మ : కాలకుని ఎత్తుగడ సఫలీకృతమైంది. మహారాజు చేత, అసాధ్యమైన కార్యభారం నా కప్పగించాడు. ఒక్క రాత్రిలో, ఉద్యానవనము, సరస్సు, సౌధము నిర్మించటం సాధ్యం కాదు. కాదని మహారాజుగారికి తెలియకపోలేదు. తెలిసికూడా ప్రభువులు, పట్టుబడుతున్నారంటే కాలకుని విషవ్యూహంలో ప్రభువులు చిక్కుకొన్నట్లు భావించవచ్చును .... రేపటి సూర్యోదయ వేళకు నే నివి నిర్మించలేకపోతే, మరణ దండనకు అంగీకరించక తప్పదు...కానీ మరణ మంటె నాకు భీతిలేదు. జాతస్య మరణం ధ్రువం... పుట్టుక ఉన్న ప్రతి దానికీ మరణం తప్పదు. కానీ ఈ లక్షలాది ప్రజలు, మరల కాలకుని బాధలకు గురికాక తప్పదు. వారిని తలచుకొంటున్న కొందికీ, నా హృదయం వ్రక్కలయిపోతున్నది. వారిని రక్షించే మార్గ మేమీ కనిపించటంలేదు. భగవాన్...ఏమిటీ వైపరీత్యం?

ఒకరు : ఆ వైపరీత్యం బైట లేదు నాయనా...నీలోనే ఉన్నది. ఆత్మగతమైన ఆ వ్యవస్థను, అంగీకరించలేక, దానిని బాహ్యానికి ఆపాదిస్తున్నావు.

ధర్మ : ఎవరికి? ఎవరా మాట్లాడుతున్నది?

ఒకరు : నేను...

ధర్మ : నీవా?

ఒక : అవును నేనే.

ధర్మ : ఓ అదృశ్యవ్యక్తీ, నీ వెక్కడినుండి మాట్లాడుతున్నావు?

ఒక : (నవ్వి) నీ ప్రక్కనుండి.

ధర్మ : ఏదీ? ఎక్కడ? నా ప్రక్క నెవరూ లేరే...

ఒక : పిచ్చివాడా నీకు కనిపించనంత మాత్రంచేత ఎవ్వరూ లేరనుకోకు.

ధర్మ : నాకు కనిపించనివి లేవని నే ననుకోవటం అపరాధం కాదు. ఈ క్షణాన నువ్వు నాకు గోచరించటం లేదు. కాబట్టి నువ్వు లేవని నేను అనుకొంటున్నాను.

ఒక : లేని నాతో నువ్వెలా సంభాషిస్తున్నావో నాకు అర్థం కావటం లేదు. నేనే లేకపోయినట్లయితే, ఇంతసేపూ నువ్వు నాతో మాట్లాడినది గూడా లేకుండా పోవాలి. అయితే నువ్వేమీ మాట్లాడనే మాట్లాడలేదా ధర్మమూర్తీ...

ధర్మ : మహాత్మా, మీరొక విచిత్రావస్థలో నన్ను చిక్కుకొనేటట్లు చేశారు. మీ ప్రశ్నకు నేను సమాధానం చెప్పలేను. మీరు ఎక్కడనుండి మాట్లాడు తున్నారో సెలవీయండి.

ఒక : అలా దిక్కులు చూస్తావేమిటి ధర్మమూర్తీ ... నేను నీ ఎదుటనే ఉన్నాను. ఇలా చూడు.

ధర్మ : అవును స్వామీ ... ఉన్నారు. నేనే గుర్తించలేక పోయాను. స్వామీ మీ రెవరు?

ఒక : నన్ను చమనుడు అంటారు. స్వర్గాధిపతియైన శచీ ధవుని ఖాండవ వనానికి నేను మాలిని. ప్రమథుల నృత్య కళాకౌశల మీనాడు ప్రదర్శింప బడుచున్నది. దిదృక్షా యత్తచిత్తంతో నేను తుహినాద్రికి వెళ్ళుతున్నాను. త్రోవలో నీవు కనిపించావు.

ధర్మ : మహాత్మా! అయాచితంగా మీ దర్శనం లభించింది. మీరు దేవతలు. దేవతా దర్శనం సకలాభీష్ట ఫలప్రద మంటారు. మీరు—

చమ : ధర్మమూర్తీ ఇక చెప్పవద్దు. నాకు తెలుసు. స్వార్థ బుద్ధితో కాకుండా, పరార్థబుద్ధితో నువ్వొక కోరికను కోరుతున్నావు. నిజమే, కాలకుడు నీకు మరణ శిక్ష విధించాలనే ఈ అసాధ్య కార్యం నీకప్పగించాడు. విచారించకు. నేను వాటిని నిర్మిస్తాను. మీ ప్రభువులు ఎక్కడ ఉద్యాన వనము, సరస్సు, సౌధము కావలెనన్నారో చూపించు.

(విరామం)

*　　　*　　　*

ధర్మ : ఇక్కడ

చమ : మంచిది...(పాజ్) ఇదిగో వనం.

(తగ్గు స్థాయినుండి హెచ్చు స్థాయికి జంత్ర వాయిద్యాల ధ్వని)

చమ : ఇదిగో సరస్సు.

(హెచ్చు స్థాయినుండి తగ్గు స్థాయిలోకి)

చమ : ఇదిగో దంతఖచితమైన భవనం. ఇది మృదుశయ్య. ఇది పగడపు దివ్వె.

(కలగా పులగంగా ధ్వనులు, పక్షుల రుతాలు క్రమంగా సమసి పోతాయి)

ధర్మ : మహాత్మా! కాశీరాజ్య ప్రజలు మీ మేలు జన్మ జన్మలకు మఱచిపోరు. కాలకుని విషచ్ఛాయ వారిపై ప్రసరించకుండా చేశారు. వందనాలు.

చమ : నీవు నీ ప్రజలతో సుఖంతువు గాక. కాలాతీతమైంది. వెళ్ళుతున్నాను.

(రివ్వున ఎగసిన చప్పుడు)

*  *  *

యశ : కాలకా ! నీ ఆలోచనమంతా అణగారిపోయిందోయి. ధర్మమూర్తి నా ఆజ్ఞానుసారంగా అన్నీ సమకూర్చాడు.

కాల: అంతమాత్రంచేత అపరాధి నిరపరాధిఅవుతాడా ప్రభూ!

యశ : కాక! ఆజ్ఞోల్లంఘన మేమీలేదే? మరి శిక్షించడానికి కారణ మే మున్నది? నిష్కారణంగా ధర్మమూర్తికి, మరణదండన విధిస్తే మన ఉనికికే ప్రమాదం సంభవించవచ్చు.

కాల : మీ మాటను కాదనలేను. కారణాలు కొరవయినప్పుడు గదా, నిష్కారణంగా దండించవలసివస్తుంది... ఆ బాధలేమీ లేనప్పుడు, దానిని గురించి విచారించటం హాస్యాస్పదం ... అదీగాక ధర్మమూర్తి శక్తి సామర్థ్యములంటే యేమిటో తమ కిప్పుడు తెలిసి ఉంటాయి. ఒకే ఒక రాత్రిలో, ఇన్నిటిని సృష్టించిన మహామాయావికి, మీ సింహాసనం అపహరించటం ఎంత సులభమో ఆలో

చించండి. అతనికి ఏ దేవతయో, దయ్యమో సాయపడి ఉండాలి. లేదా, మంత్ర ప్రయోగమన్నా జరిగి ఉండాలి.

యశ : నిజమా కాలకా ?

కాల : కాకపోతే యివి మానవసాధ్యా లెలా అవుతాయి ప్రభూ ?

యశ : మరి క ర్తవ్య మేమిటి ? నాకు ప్రాణభిక్ష, రాజ్యభిక్ష నువ్వే యివ్వాలి కాలకా ... నీవు తప్ప మరొకరిందుకు సమర్థులు కారు.

కాల : భయపడకండి. అందుకు తగిన ఆలోచన నేను ఆలోచించాను. ఆకృతులు—ఏ దేవతల సాయంచేతనో, మంత్ర తంత్రాదుల చేతనో చేయవచ్చు. కానీ ప్రభూ ... గుణములు అట్లాకాదు. అవి మాయోపాయాలచేత ప్రాప్తించవు. కాబట్టి చతుర్విధ గుణవిలసితుడైన మానవుణ్ని— ఈ వనాదులకు కాపరిగా నియమించమని ధర్మమూర్తికి ఆజ్ఞ యివ్వండి. మన ప్రయత్నం ఫలించి తీరుతుంది.

(పాజ్)

* * *

ధర్మ : కాలకుడు నిజంగా కాలకుడే. తన కరాళ జిహ్వాకలతో నన్ను కబళింప జూస్తున్నాడు. వనాదులు చమనుని సాయంతో పూర్తి చేశాను. కానీ నాలుగు గుణములు గలిగిన మానవుణ్ని — కాపరిగా — నే నెక్కడ నుండి తేగలను ? దుష్టుడైన ఆ కాలకుని చేతిలో చనిపోవటం కన్న ఈ ఆరణ్యంలో సత్యాన్వేషణ చేస్తూ ప్రాణాలు విడిచిపెడతాను.

కంఠం : అయ్యా, ఎవరు మీరు ?

ధర్మ : నేనా?
కం : అవును.
ధర్మ : అది తెలుసుకుందామనే యిక్కడికి వచ్చాను.
కం : అయితే ఇంతవరకూ, మీ రెవరో మీకు తెలియదా!
ధర్మ : తెలియదు. తెలుసుకొందామని గూడా ప్రయత్నించలేదు. ఆ అవసరం గూడా కలగలేదు కాలుడనే పేరు మీకు తెలుసుననుకొంటాను ... అతనొక విపత్కరమైన పరిస్థితిని నాకు కల్పించాడు. దానిని ఛేదించలేకపోయాను. ఇలా వచ్చాను. వచ్చినప్పటి నుండీ, నన్ను ఎన్నో ప్రశ్నలు వేధిస్తున్నాయి. నే నెవరు? కాలు డెవరు! ఈ ప్రజ లెవరు? నాకూ ఈ కాలునకూ మధ్య వైరుధ్య మెందుకు జనించినది? అందరమూ మానవులమే గదా! ఈ పరస్పరహరణోద్యోగ మేమిటి?
కం : ఓహో! మీ పేరు ధర్మమూర్తిగదూ!
ధర్మ : అవును. మీ కెలా తెలుసు?
కం : మీ ఇద్దరి మధ్యా వైరుధ్య మున్నదని ఈ ప్రాంత మంతా చెప్పుకోటం వాడుక. మీరు గూడా మాటల్లో మీ ఇద్దరకూ వైరుధ్యమున్న దన్నారు. దానినిబట్టి మీరు ధర్మమూర్తి అయిఉంటారని అనుకొన్నాను. అయితే, మీ రిక్కడి కెందుకొచ్చినట్లో?
ధర్మ : నేనొక విపత్కర పరిస్థితిలో చిక్కుకొన్నాను.
కం : అది రహస్యం కాకపోతే నాకు చెప్పగలరా?
ధర్మ : మీ పేరు?
కం : పేరునుబట్టి, నేనా పరిస్థితిని అర్థంచేసుకోగలనో లేదో నిర్ణయిస్తారా? (నవ్వు) నా పేరు ఇంద్రాణి.

ధర్మ : ఇంద్రాణీ! మా ప్రభువు నాకొక ఆజ్ఞ నిచ్చారు. తెల్ల వారు వేళకు వనము, కొలను, భవనము నిర్మించకపోతే, మరణదండనము విధిస్తామన్నారు. ఖాండవవన పాలకుడైన చమనుని సాయంతో, ఆ ఆపద గడచాను. తిరిగీ మరొక ఆజ్ఞ. నాలుగు గుణములు గల వానిని ఆ తోటకు కాప రికా నియమించవలెనట. ఇది దేవతలకు కూడా అసాధ్యమే! అందుకే—

ఇంద్రాణి : మీా రిలా వచ్చారనుకొంటున్నాను.

ధర్మ : అవును.

ఇంద్రా : ఈ స్వల్పవిషయం కోసం ఇంత దూరం రావాలా ధర్మమూర్తీ?

ధర్మ : ఇది సల్పవిషయమా ?

ఇంద్రా : అరచేతిలో మాణిక్య ముంచుకొని, గాజుపూస కొరకు పరభూములు వెదకేవారు కనిపిస్తున్నారు, నాకు మిమ్మల్ని చూడగానే...

ధర్మ : అరచేతిలో మాణిక్యమా ఇంద్రాణీ!

ఇంద్రా : యశపాణి ప్రభువుల కొలువులోనే ఛత్రపాణి అనే మహాశిల్పి ఒక రున్నారు. అతనికి నాలుగు గుణాలూ ఉన్నాయి. అతనిని రాజు వద్దకు తీసుకువెళ్ళు. నీ ఆపద తీరిపోతుంది...అదిగో అటు చూడు. హయారూఢుడై కాలకుడు ఇటువైపే వస్తున్నాడు. బహుశః నీ కోస మను కొంటున్నాను. ధర్మమూర్తీ, నేను వెళ్ళుతున్నాను. అతని పేరు ఛత్రపాణి. మరచిపోకు.

(ఇంద్రాణి అదృశ్యమవుతుంది. దూరంనుండి గుర్రపు డెక్కల చప్పుడు దగ్గరవ వస్తుంది.)

కాల : ఓహో ధర్మమూర్తీ! అడవిలో దాగికొనినంత మాత్రం చేత, నీకు శిక్ష తప్పదు. రా, యశపాణి ప్రభువుల ముందు నీ మాయాజాలాన్ని ప్రదర్శించి, వారిని ఉత్సాహపరతువు గాని, సభకు రా.

ధర్మ : పద వస్తున్నాను.

(పాజ్)

* * *

(సభా భవనపు గోల మెల్లగా తగ్గిపోతుంది)

కాల : మహారాజా! ఇదుగో ధర్మమూర్తి. ప్రభువులవారి ఆజ్ఞను ఉల్లంఘించి, ఈ తులువ అరణ్యంలో తలదాచుకొన్నాడు. నేను భటుల సాయంతో వనమంతా గాలించి బంధించాను. ఆజ్ఞోల్లంఘునకయి యితనికి మరణదండన విధించవలెనని నా ప్రార్థన.

1వ సభ్యుడు : ఆజ్ఞను ఉల్లంఘించి నపుడు కాలకులు నిర్ణయించిన శిక్షను అమలు జరుపవచ్చు. ధర్మమూర్తి ఆజ్ఞను ఉల్లంఘించినట్లు విచారణ జరుగలేదు. కాబట్టి విచారణ జరుగనిదే ధర్మమూర్తిని శిక్షింపరాదని యశపాణి ప్రభువులను నేను ప్రార్థిస్తున్నాను.

యశ : ధర్మమూర్తీ! చతుర్విధ గుణ విలసితుడైన వనపాలకు డెక్కడ ?

ధర్మ : ఇదుగో మహారాజా మీా ఎదుటనే ఉన్నాడు.

యశ : ఎవరు? ఎక్కడ ?

ధర్మ : ఛత్రపాణి చతుర్విధ గుణ విభాసితుడు.

కాల : కాదు అబద్ధం ... ఛత్రపాణి మహాశిల్పి. అంతేకాని గుణ చతుష్టయ విభాసితుడు కాడు. స్వప్రాణ రక్షణార్థ

మయి, ఈ ధర్మమూర్తి ఈ సభ్యులను, మహారాజును మోసగించ చూస్తున్నాడు. ఇది మరొక నేరం.

యశ : సేనాపతి అంటున్న మాటలకు నీ సమాధాన మేమిటి ధర్మమూర్తీ!

ధర్మ : కాలకుడు సత్యం వచించలేదు. నేను ప్రాణ రక్షణార్థ మయి అసత్యమాడనని ప్రభువులు తెలుసుకొందురుగాక.

యశ : ఈ ఛత్రపాణిలో గుణ చతుష్టయము ఉన్నదా?

ధర్మ : నిస్సందేహంగా. ఇతనిలో హింసలేదు. పానాసక్తిలేదు. స్వార్థచింతన లేదు. క్రోధము లేదు.

కాల : ఏమోయి ఛత్రపాణీ! నీలో ఈ నాలుగు గుణములు లేకపోవుట — అను గుణములు ఉన్నాయా?

ఛత్ర : అయ్యా ఇది ఆత్మస్తుతి అని అనుకోనిపక్షంలో ఉన్నా యని వొప్పుకుంటున్నాను.

రాజు : ధర్మమూర్తి నీకేమేమి ఆశచూసి ఈ మాట లన మన్నాడు ఛత్రపాణి...

ఛత్ర : అయ్యా! నేను ఆశను జయించాను.

యశ : నీ మాటలు సత్యములని మేము ఎట్లా విశ్వసించాలి? ఈ గుణాలు మానవుని ఎట్టి పరిస్థితిలోను వదలవుగదా?

ఛత్ర : ప్రభూ నేను త్యజించాను. వీటిని జయించాను.

యశ : హింసను ఎట్లా జయించావు ఛత్రపాణీ?

ఛత్ర : ప్రభూ! మాది వొక క్షుద్రగ్రామం. దానికి సమీపంలో శ్యామల వనమనే అరణ్యం ఒకటి ఉన్నది. దానిప్రక్క నుండే శ్రావస్తి నగరానికి ఒక కాలిబాట ఉన్నది. చిన్న తనంలో ఆ దారిగాచి, ప్రయాణీకులను దోచుకొంటం, నాకు అభ్యాసం. ఒక రోజున కొంతమంది సార్థవాహులు

ఒంటెలమీద సరకులు వేసికొని (శ్రావస్తికి వెళ్ళుతున్నారు. ఒంటరిగా వారిని నేను ఎదుర్కొనలేను. అందుకని — పొదలమాటున నక్కి — విష సక్తములయిన బాణములు ప్రయోగించాను. అయిదారుగురు మృతిచెందారు. ఇంకొక బాణం సంధించి, ఎత్తుగా కనిపిస్తున్న ఒక తలకు గురి చూచి విడిచాను. ఆ బాటసారి శివశివ అంటూ నేలకు వరిగాడు. ఆ కంఠధ్వని విన్నదానివలె తోచి దగ్గరకు వెళ్ళాను. ఆ దీర్ఘకాయుడు మా తండ్రిగారు. ఆ నాటి నుండే నేను హింసను త్యజించాను.

(పాజ్)

*　　　*　　　*

కాల : అబద్ధం. ఇది అభూత కల్పన.

ధర్మ : ఋజువేమిటి కాలకా?

కాల : సత్యమని నీవు ఋజువు చెయ్యగలవా?

ధర్మ : అసత్యమని మీరు నిరూపించేటంతవరకు ఇది సత్యమే అవుతుంది.

యశ : అయితే పానాసక్తిని ఎట్లా త్యజించావు ఛత్రపాణీ!

ఛత్ర : మహారాజా! బాల్యంనుండీ నాకీ దురభ్యాసం ఉన్నది. విచ్చలవిడిగా తాగి సంచరిస్తుండే వాడిని. సిగ్గుబిడియాలు వదలి వేశాను. కానీ నా మేనకోడలును చూచి మాత్రం భయపడుతుండేవాడిని. ఆమె నన్ను చాలా ఆదరించేది. నా విషయం ఇతరుల వలన విని, ఎంతగానో ఖేదించేది. ఒకనాడు ఆమె యింటికి వెళ్ళాను. ఆమె తమ్ముడు భంగు తాగుతున్నాడు. నన్నుగూడా రుచి చూడమని ఆహ్వానించాడు. నేను తిరస్కరించాను. నీకు కావలసినది యిది

కాదుఅది_అనివాడు అపహాసించాడు. అదికూడాఅవసరము లేదన్నాను. ఆ అవసరము కలుగకుండా చూడమని దేవుణ్ని ప్రార్థించాను. ఈనాటివరకూ మరల పానపాత్రముట్టలేదు.

యశ : ఛత్రపాణీ! నీ కార్యదీక్ష అకుంఠితమైనది. నీ ప్రవర్తన అద్భుతమైనది. మరి స్వార్థచింతనను ఎలా జయించావు ఛత్రపాణీ?

ఛత్ర : ప్రభూ...! నేను చాలా స్వార్థపరుణ్ని. చిన్నతనంలో నా ఆట వస్తువులు ఎవరన్నా తాకితే, వారితో కలియ బడటం నాకు అభ్యాసం. నా సుఖానికి ఎవరు అడ్డం వచ్చినా వారిని హతమార్చటానికి వెనుకాడటమంటూ లేదు. ఒక రోజున నే నొక కలగన్నాను. ఆ కలలో నేను గంజాయి తాగుతున్నాను. ప్రమాదవశాత్తు అగ్నికణ మొకటి ఎగసి గృహము దగ్ధమయిపోయింది. అందులోనే నా మేన కోడలు మరణించింది. ఇదీ నా స్వప్న వృత్తాంతం. నాకు చాలా భయమేసింది. ఉదయమే నేను బోధిసత్వుని, ఈ విషయమై అడిగాను. బోధిసత్వులు_

"ఛత్రపాణీ! నీకు గంజాయిపై మమకారం అత్యధికం. కానీ నీ మేనకోడలి భయంచేత దానిని నీవు యథేచ్ఛగా ఉపయోగించటం లేదు. నీ మేనకోడలు చనిపోతే, గంజా యిని పుష్కలంగా వాడుకొనవచ్చునని నీ మనస్సులో ఉన్నది. ఈ స్వార్థచింతన నీలో ఉన్నది గనుక నే _ నీకు అలాంటి కల వచ్చింది......" అన్నారు బోధిసత్వులు. ఆ క్షణాన నా కర్థమయింది స్వార్థం నా ప్రబల శత్రువు అని. ఆ శత్రువును జయించాను.

యశ : ఆర్యా! మీరు సామాన్య మానవులు కారు, మహా

జ్ఞానులు మీ ప్రభావాన్ని తెలిసికొనలేక పోయాము.

ధర్మ : ఛత్రపాణీ, క్రోధాన్ని ఎలాజయించావో చెప్పు. అప్పటికి కాలకులవారికి మిగిలివున్న ఆ ఒక్క సందేహమూ తీరిపోతుంది.

కాల : అభూతకల్పనలకు ఆధారాలు ?

యశ : (కోపంగా) కాలకా, ఆగు. (శాంతపడి) ఛత్రపాణీ ... క్రోధాన్ని ఎలా జయించారు మీరు ?

ఛత్ర : మహాప్రభూ ! ఈ ఘట్టం – నా జీవితచరిత్ర మంతటి లోనూ, అత్యంత కరుణరస ప్లావితమైనది. దుర్గుణాలతో జన్మించాను. అపమార్గాల్లో ప్రయాణం చేశాను. జీవితానికి సార్థకత గోచరించలేదు. మానవజన్మ మెత్తినందుకు నేను సాధించిం దేమిటి ? ఏమీ లేదుగదా ? ఈ మూడు గుణాలను వర్జించిన తరువాత, జ్ఞాన జిజ్ఞాస రేకెత్తింది. పరలోకచింతన మోసులెత్తింది. ఈ ఇహ లోకంతో సంబంధం త్రెంచుకోవాలనుకొన్నాను. మా ఇంటి దాపులోని తోటలో ఒక కుటీరం నిర్మించుకొని, ధ్యాన సాధనం మాత్రం ప్రారంభించాను.

ఒకనాడు నేను ధ్యానముద్రలో నున్నప్పుడు నా మూడేండ్ల కూతురు, బాల్యచాపల్యంచేత ఆడుకొంటూ ఆడుకొంటూ నా దాపుకు వచ్చింది. ఆ పసికందు రాకతో నా ధ్యానం భగ్నమైంది. క్రోధభూతం నన్నావేశించింది. మన్ను మిన్ను తెలియలేదు. ఆ పసిపాప రెండుకాళ్ళు గట్టిగా పట్టుకొన్నాను...గిరగిర గిరగిర మని త్రిప్పి, దగ్గరలో చెట్టుకు విసరి కొట్టాను. తల బ్రద్దలయి పోయింది. గుండె విచ్చిపోయింది. రక్తమాంసాదులు, నాలుగు వైపులకు చిందిపడ్డాయి. నా కుటీరప్రాంతమంతా రక్తత ప్త

మయిపోయింది. నా కన్నులకు చీకట్లు క్రమ్మాయి. నా కూతురు ప్రాణవాయువు లీ అనంత వాయువీచికలలో లీనమయిపోయాయి. వానితో బాటుగానే, నాలోని క్రోధ ధూమములు కూడా అంతరించాయి.

యశ : మహాత్మా! మీ రింతటి దీక్షాబద్ధులని తెలియక, చిన్న చూపు చూచాను. నన్ను, నా అజ్ఞానాన్ని క్షమించండి. ఇకనుండి మీరు, నా వనానికే గాదు, నాకూ, నా దేశంలోని ప్రజ లందరకూ రక్షకులుగా ఉండండి.

ఛత్ర : ప్రభూ! నా శక్తి అత్యల్పం. అయినా, నా గతజీవితం పాప పంకిలం. నేనే తరుణోపాయంకోసం ఈ మహాత్ముని సేవిస్తున్నాను. ధర్మమూర్తి నామధేయులైన, ఈ బోధి సత్వుని బోధనల వలననే, నేనా అచేతన దశనుండి చేతనారూపం దాల్చాను.

యశ : ధర్మమూర్తీ! తెలియక చేసిన నా తప్పిదాన్ని క్షమించండి. మీ వంటి జ్ఞానగరిష్ఠులను హింసపాలు చేయటానికి ప్రయత్నించిన ఈ కాలకునికి మరణశిక్ష విధిస్తున్నాను.

ధర్మ : బౌద్ధము హింసాప్రవృత్తిని అంగీకరించదు ప్రభూ... దానికి శత్రువులు లేరు. అసహ్యాము లేదు. తర తమ భేదాలు లేవు. సత్యాలూ దానికి సర్వమూ దానికి సహ్యాము. జ్ఞాన సముపార్జన, సత్యాన్వేషణ విషయ జిజ్ఞాస ముఖ్యం. కాలకుని క్షమించండి. అతని పశ్చాత్తాపమే అతణ్ని పునీతుణ్ని చేస్తుంది.

అందరు : బుద్ధం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి

# 'కదిలించకు సుప్తభుజంగాలను'

పాత్రలు :

| | |
|---|---|
| వ్యాఖ్యాత | తురంగరావు భార్య |
| తురంగరావు | నిర్మల |
| ప్రొడ్యూసరు | కామిని |
| మంత్రి | |

వ్యాఖ్యాత : శ్రోత లందరకూ మా విన్నపం. ప్రకటింపబడిన కార్యక్రమానికి బదులు, శ్రీ తురంగరావుగారితో పరిచయ చిత్రాన్ని వింటారు. తురంగరావును గురించి ప్రత్యేకంగా చెప్పవలసిందేమీ లేదు. కోటానుకోట్ల మానవుల్లో అతగాడూ ఒకడు. మధ్యతరగతి మనస్తత్వానికి తురంగరావు తిరుగులేని ఉదాహరణ. అతన్ని గురించి ఏమి చెప్పడమైనా సాహసమే ననాలి. ఏమి చెప్పినా, యదార్థం చెప్పినట్లవుతుందా — కాదా — అన్న విచికిత్స తప్పకుండా కలిగి తీరుతుంది. అతని విషయం ఏమిటో అతని నోటంటే విందాం. (బిగ్గరగా) ఏమండోయ్ తురంగ రావుగార్లూ, ఒకసారిగా దయచేయండి.

తురంగ : యస్ సార్. వస్తున్నాను, సార్. ఏమిటి సార్ ?

వ్యా : పొరపాటున పలకరించామే, ఇలా మాట్లాడుతాడు. దశాబ్దాలపాటు వ్యక్తిత్వాన్ని అణచుకొన్న చిహ్నాలు అతని మాటలనిండా, కోకొల్లలుగా కనిపిస్తాయి. పసిడి

లాంటి పరువాన్ని, బల్లలకూ, కాయితాలకూ అంకితం చేశాడు. అందరికీ దాసోహమనడం—అప్రయత్నంగా అల వాటయిపోయింది. కోరికలు, అభిరుచులు, వాటి విష యానికి తరువాత వద్దాం. మనం మర్యాదగా, తురంగ రావుగారూ, అని పిలిచాం కదాండి ? అతను ఉలిక్కి—పడి, చొక్కా— సర్దుకుంటూ గుటకలు మింగుకుంటూ మాట్లాడ తాడు. ఆఖరికి భార్యతో కూడా ఇదే తంతు. ఆవిడ పిలిచినా, 'యస్ సార్, వస్తున్నాను సార్' అంటాట్ట. ఏమమ్మా ఈ మాట నిజమేనా ?

భార్య : ఎందుకులెండి బాబూ! కడుపు చింపుకొంటే కాళ్ళ మీద పడుతుంది. చెప్పుకొంటే సిగ్గుబోయె, చెప్పు కోకపోతే......

వ్యా : నిజమే ననుకోండి. తురంగరావుగారు మీతో కూడా అలానే మాట్లాడతారా ?

భార్య : నా నోటి మీదుగా ఎందుకు చెప్పిస్తారు నాయనా. వినేవాళ్ళు నవ్వుతారని కూడా లేదు ఆయనికి. ఇంటికీ, ఆఫీసుకీ భేదం లేకుండా పోయింది.

వ్యా : తురంగరావును గురించి ఇంతకన్నా గట్టి రుజువును సంపాదించడం అసంభవం. చూడండి — ఇప్పుడు తురంగ రావుగారు, ఎక్క—డికో హడావుడిగా వెళ్ళిపోతున్నారు. ఏం నాయనా, అంత తొందరగా వెళుతున్నా రెక్క—డికి ?

తురంగ : ఆఫీసుకండి.

వ్యా : ఇవ్వాళ ఆదివారం గదూ ?

తురంగ : నిన్నటి పని మిగిలి పోయిందండీ.

వ్యా : అబద్ధమాడినా తెలిసిపోయేట్టు ఆడితే ఎలాగండీ ? నిజంగా చెప్పండి. ఇప్పుడు మీరు వెడుతున్నది ఆఫీసు కేనా ?

తురంగ : కాదనుకోండి గానీ — ఆ పనిమీద నేనండి. ఆఫీసరు గారి చిన్నమ్మాయీ, అల్లుడూ పండక్కని వచ్చారు. వారికి పట్నం చూపింతామని వెడుతున్నాను. కొంపతీసి, ఈ మాట ఎక్కడా అనకండి బాబూ. కొంపలంటు కొంటాయి.

వ్యా : ఇందువల్ల నీకేం వరవగుతుందయ్యా అన్నాను. పల క్కుండా, తొరతొరగా వెళ్ళిపోయాడు. నాకెందుకో తురంగరావును చూస్తుంటే యంత్రం జ్ఞప్తికొస్తుంటుంది. ఒకేరకమయిన పనిని విధీ విరామమూ లేకుండా యంత్రం చేస్తుందాండి, మనవాడు గూడా శుద్ధడిటో, యంత్రానికి అప్పుడప్పుడు విశ్రాంతన్నా కావాలి. ఒక్కోసారి, నేను పని చెయ్యనని, అది మొండికేసినా వెయ్యొచ్చు. కానీ మనవాడలా కాదు. అతని దినచర్య, అచ్చుపోసినట్టుగా ఒకేతీరున ఉంటుంది.

తురంగ : ఆరు గంటలకు లేస్తాను. అవసరాలు తీర్చుకొన్నాక కాఫీ తాగుతాను. ఇంట్లో కూరా నారా తెస్తాను. ఆవిడ వంటయిందాకా, చంటివాణ్ని ఆడిస్తాను. రెండు మెతు కులు తిని ఆఫీసుకు వెడతాను. రాత్రి 8 గంటలకు ఇంటి కొస్తాను. స్నానం చేస్తాను. అన్నం తింటాను. నిద్రపోతాను.

వ్యా : ఆశ్చర్యపడకండి. పాతిక సంవత్సరాలనుండీ, తురంగ రావు జీవితం అలానే నడుస్తోంది. ఓమార్పు లేదు. కదలిక లేదు, చైతన్యంలేదు, ఏమీలేదు. సాఫీగా రూళ్ళకర్రలా,

సాగిపోతోంది. అయినా తురంగరావు కొన్ని విషయాలు మనకు చెప్పకుండా దాచాడు. అప్పుడప్పుడు మల్లెపూలు తెస్తాడు తురంగరావు. నెలకు రెండు మూడు దఫాలు సినిమాకు వెడతాడు. అందమైన బొమ్మలున్న పత్రికలు కొంటాడు. ఆడవాళ్ళకేసి ఆకలిగా చూస్తాడు. ఎవ్వరూ చూడకుండా మసాలా పకోడీలు తింటాడు. ఒకసారి తురంగరావును, చాటుకు పిలిచి, అతనికి గిట్టని వేమిటో అడిగాను.

తురంగ : చాలా ఉన్నాయండీ బాబూ. అసలు నాకు ఆఫీసులో పని చెయ్యటమంటేనే గిట్టదు. ఆఫీసరంటే గిట్టదు. ఇల్లంటే గిట్టదు. పిల్లలంటే గిట్టదు. గడియారమంటే గిట్టదు. డబ్బన్నా, అందమన్నా గిట్టదు. ఆడదన్నా, సుఖమన్నా గిట్టదు. కీర్తి, అధికారం, హోదా, అంటే గిట్టదు. అన్నిటికీ మించి వెలుతురంటే నాకు అసహ్యం, సుఖపడే వాళ్ళంటే పరమ అసహ్యం.

వ్యా : తురంగరావు కిప్పుడు 40 ఏళ్ళు, అవునాండి – జీవితమంటే అతని కున్న అభిప్రాయాలు మీరు విన్నారుగదూ! నిజంగా – మొదటినుండి అతనిలా లేదు. అతని చిన్నతనం, పచ్చగా, నులివెచ్చగా సాగిపోయింది. మార్పులేని జీవితం అతనిలోని సున్నిత భావాలను చంపి, శిలను చేసింది. ఇంత చెప్పినా, తురంగరావేదో దాస్తున్నాడన్న అనుమానం నాకుంది. మీకు మాత్రం లేదా! అతని కోరికలు తెలుసుకొందామనుకున్నాను. వీలు పడిందికాదు. అందుకని తురంగరావుగారి మానసిక జీవితాన్ని రికార్డు చేశాను. మొదటి భాగం వినండి.

(క్షణం విరామం — రికార్డుమీద ముల్లు గీచుకొన్న ధ్వని .... తరువాత .... గద్గోలుగా)

'జై, అరవీర భయంకర, శతృహృదయ నిర్భేదక, మానినీ మానసచోర, మదవతీ హృదయాధినాథ, తురంగ సామ్రాట్టుకూ జయ్ జయ్ జయ్.'

ఓ నిమిషంపాటు, ఏదన్నా డాన్స్, మ్యూజిక్. క్రమంగా ఆగి పోయాక.... —

మంత్రి : మహాప్రభూ, మగధ భూపతి నుండి దేవర దర్శనార్థం, ఒక దూత వచ్చాడు. తమ సెలవైతే, పిలిపించు దామనుకొంటున్నాను.

తురంగ : అవశ్యం. ప్రవేశపెట్టు మంత్రీ.

మంత్రి : (చప్పట్లు చరిచి) ఎవరక్కడ. ఆ దూత నిలా తీసుకురండి.

(అడుగుల చప్పుడు)

మంత్రి : ప్రభూ! మగధరాజు, ఏదో సందేశాన్ని పంపినట్టున్నాడు...ఓయీ, ఆ పత్రమిలా అందుకో...(ఆగి) ప్రభూ, చిత్తగిస్తారా?

తురంగ : ఏమది?

మంత్రి : అవధరించండి. శ్రీ శ్రీ శ్రీ తురంగ భూపాల పాద సన్నిధికి, మగధరాజు అభివందనా లాచరించి వ్రాయించిన విన్నపం. దేవా! మా ప్రాక్ సరిహద్దులలో అలజడులు జరుగుతున్న విషయం, మీ కర్ణగోచరమయే ఉంటుంది. నికుంభరాజు మదోన్మత్తుడై చరిస్తున్నాడు. ఇప్పట్టున, నేను మీ సాయాన్నభిలషిస్తున్నాను. ప్రతి కృతిగా నే నివ్వగలిగిన దేమీ లేదు. మా చిరంజీవిని —

మీ అంతఃపుర వాసాన్ని అభిలషిస్తున్నది. దేవర ఆజ్ఞ కోసం ఎదురు చూస్తుంటాను.

తమ విశ్వాసపాత్రుడు.

తురంగ : మంత్రీ!

మంత్రి : ప్రభూ!

తురంగ : సర్వసైన్యాలనూ సిద్ధపరుచు, నికుంభుని గర్వాన్ని అణచు.

మంత్రి : చిత్తం.

(కాస్సేపు వార్ బ్యాండ్ వినిపించాలి....)

వ్యా : మొదటి రికార్డు విన్నారు గదూ? ఇప్పుడు రెండవ భాగం వినండి.

(ప్లేటుమీద పిన్ను గీచిన చప్పుడు అయ్యాక)

తురంగ : (ఆనందంగా) ఓహ్హో! ఎంత అందంగా ఉన్నావ్ నిర్మలా! నిన్ను చూస్తుంటే...

నిర్మల : ఏమిటా మాటలు? ఎవరన్నా వింటే—

తురంగ : నేను కవినైతే ఎంత బావుండును నిర్మలా! పచ్చగా, పసిడిలా, సాయంత్రపు మబ్బులా, నక్షత్రపు తొలి కిరణంలా, విరియబూసిన తంగేడు పొదలా—

నిర్మల : ఇలా ఎంత సేపు మాట్లాడతావ్ రావుజీ.

తురంగ : రోజులూ, వారాలు, నెలలూ, సంవత్సరాలు, యుగాలు ఇలా—ఇలానే, నీ కెదురుగా కూచుని, నీ సన్నని వేళ్ళతో వేళ్ళు కలిపి, నీ కళ్ళల్లోకి, తదేకంగా చూస్తో అందులో నా నీడలు వెదుక్కుంటో, ఒహ్హో — నిర్మలా నా జన్మ తరించింది. నా పుట్టువు ఫలించింది.

నిర్మల : ఇలా ఎంతకాలం భయపడుతూ, భయపడుతూ, ఉందాం రావుజీ. దీని కేదన్నా పరిష్కారం ఆలోచించవూ?

తురంగ : నువ్వే చెప్పు నిర్మలా!

నిర్మల : మా జమీందారీ కుటుంబాల్లో, కొన్ని అమానుష మైన ఆచారా లున్నాయి రావుజీ. నే నిలా – చాటుగా నిన్ను కలుసుకొంటున్నట్టు–పెద్దవారికి తెలిసింది. అందుకే నేనింత భయపడుచున్నాను.

తురంగ : మనం కలుసుకొనడానికి వీలే లేదా? నిర్మలా, మన పవిత్ర ప్రేమ...

నిర్మల : నేను మాత్రం నిన్ను చూడకుండా ఉండగలనా రావుజీ? కన్ను మూసినా, తెరచినా నీ రూపమే కని పిస్తోంది. ఇలా అనుక్షణం, నీలోకి చూస్తూ, అలా చూస్తూనే ప్రాణాలు వదలాలని నేను కోరుకొంటున్నాను రావుజీ. నా కంతకన్నా ఈ ప్రపంచంలో ఇంకేమీ అవసరం లేదు.

తురంగ : మరి – ఈ సంఘం, కట్టుబాట్లు?

నిర్మల : ఇవేవి బంధించని, స్వేచ్ఛా ప్రపంచంలోనికి ఆనంద సీమల్లోనికి మనం వెడదాం రావుజీ. పద, ఏదీ నీ చేయి.

(పాజ్)

వ్యా: దయచేసి–తురంగ రావుగారి మానసిక జీవితంలోని మరో ఘట్టాన్ని కూడా చిత్తగించండి. ఇది మూడవ భాగం...

(మళ్ళా పిన్ను - ప్లేటుమీద గీచిన చప్పుడు)

తురంగ : ఏం కామినీ, ఇలా వచ్చా వెందుకు?

కామిని : మీ రింత తీరిగ్గా ఉంటారనుకోలేదు. ఈ పూట షూటింగ్ లేదా ?

తురంగ : రాత్రికుంది, ఇప్పుడే స్టూడియో నించి వచ్చాను.

కామి : మీ కోసం రెండుసార్లు ఫోను చేశాను.

తురంగ : సెక్రటరీ చెప్పాడు, ఎందుకూ ?

కామిని : ఈ మధ్య నా కేమీ పిక్చర్లు లేవండీ.

తురంగ : చూస్తున్నానమ్మా.

కామిని : ఎవరికన్నా చెప్పి, ఇప్పించకూడదూ ?

తురంగ : నేనా ?

కామి : అదేమిటండీ ? మీలాంటి మహానటుడి మాటంటే, ప్రొడ్యూసర్లు వేదవాక్యంగా తీసుకొంటారుగదా ?

తురంగ : నాకా నమ్మకం లేదు కామినీ.

కామి : నా కున్నది. పోనీ, మీరు పంపించారని వెళ్లి అడగమంటారా ?

తురంగ : అయినా పనవుతుందనుకోను. అదీగాక ఇప్పుడు కొత్త కంపెనీలు కూడా ఏవీ లేవనుకొంటాను.

కామి : గోదావరీ ఫిలిం కంపెనీ అనీ, ఈ మధ్యనే ఓ కంపెనీ పెట్టారండీ.

తురంగ : పోనీ కనిపించక పోయావా ?

కామి : అడిగాను. ఏమీ లాభం లేదన్నారు.

తురంగ : వా రెవరో నాకు తెలియదు కామినీ. ముక్కు మొఖం ఎరగని వారితో నే నేమని చెప్పను ?

కామి : వాళ్ళ పిక్చర్లో, మిమ్మల్ని హీరోగా తీసుకోవాలను కుంటున్నారు.

(కారు దూరంనుండి వచ్చి ఆగిన ధ్వని)

కామి : అదుగో ప్రొడ్యూసరు వస్తున్నాడు.

తురంగ : రానివ్వు చూడాం...అందాకా—

కామి : నేను లోపలికి వెడుతున్నాను.

ప్రొడ్యూ : నమస్కారం సార్.

తురంగ : నమస్కారం. దయచెయ్యండి, తమ పేరు......

ప్రొడ్యూ : గోవర్ధనం అంటార్లెండి. నేను గోదావరీ ఫిలింసు ప్రొడ్యూసర్నండీ. మేము కొత్తగా ఓ సోషల్ పిక్చర్ తీద్దామనుకొంటున్నాము.

తురంగ : చాలా మంచి ఉద్దేశం.

ప్రొడ్యూ : మిమ్మల్ని హీరోగా బుక్ చేద్దామని ఉంది సార్.

తురంగ : క్షమించండి. నాకు క్షణం తీరుబాటు లేదు.

ప్రొడ్యూ : అయినా సరే, మీరు వొప్పుకోవాలి సార్.

తురంగ : ఇప్పటికే నాకు పది పిక్చర్లున్నాయి. ఊపిరి తిరగడం లేదు. ఇంకెవర్నన్నా చూసుకోండి.

ప్రొడ్యూ : లాభం లేదండి. ఈ కొత్త వాళ్ళతో యాతన పడలేం. స్టార్ వాల్యూ లేనివాళ్ళతో నా పిక్చ రుండ గూడదు. మీ ముఖం ముందు అంటున్నానని కాదు సార్. మీ రున్నారంటేనే, డిస్ట్రిబ్యూటరు ఖంగుమని డబ్బు పడేస్తాడు. మీ రెలాగైనా—

తురంగ : తప్పదంటారు.

ప్రొడ్యూ : ఆ ప్రశ్నే లేదండి ?

తురంగ : నా రేటు మీకు తెలుసుగా. అంతా ఇవ్వాల్సిందే. కాంట్రాక్టు మీద 10 వేలే రాస్తాను. మిగతా డబ్బు ముందుగా ఇవ్వాలి. అట్టే యుద్ధాలూ, కలబడటాలూ ఉండకూడదు. మీ కిష్టమైతే, 1970 లో కాల్ షీట్ ఇస్తాను ... అన్నట్టు హీరోయిన్ను ఇంకా బుక్ చెయ్య లేదుగదూ ?

ప్రొడ్యూ : లేదండీ.

తురంగ : కామినిని బుక్ చెయ్యండి. ఆ అమ్మాయికూడా చాలా బిజీ ఆర్టిస్టు. అయినా నేను పిలిచి చెబుతాను. వీటన్నిటికి మీరు ఇష్టపడితే, ఎడ్వాన్సు పట్టుకురండి, కాంట్రాక్టు రాసుకొందాం....మరి నాకు సెలవిస్తారా ?

(పాజ్)

వ్యా : ఆఖరి రికార్డు కూడా విన్నారు గదూ ? నిజాని కిది ఆఖరిది కూడా కాదు. కానీ నేను తీసింది మాత్రం ఇంత వరకే. అదయినా ఒక్క రాత్రిలో, ఇలా ప్రతి రాత్రీ, తురంగరావు ఎన్ని అవతారాలు ఎత్తుతున్నాడో! దుర దృష్టవశాత్తూ తురంగరావు నిద్ర లేచాడు. లేవకుండా ఉన్నట్లయితే, తురంగరావు బహిర్జీవితంలో ఎవరికి పేచీ ఉండదనుకొంటాను. ఉన్న ఇబ్బందల్లా, మానసిక జీవితం తోనే. మీలో కొందరు, నే తీసిన ఈ రికార్డుల్ని అను మానించే అవకాశం ఉన్నది. మరొకరి మానసిక జీవితం తాలూకు రికార్డులేమో ననుకోవచ్చు. అయినా నా నిజా

యితేని, మీా రెందుకు విశ్వసించదు? .... తురంగరావు జీవితాన్ని ఆకళింపు చేసుకొన్నవారికి, ఇందులో ఆశ్చర్య పోవలసిం దేమీా ఉండదు. ఆఖరి రికార్డు చివరన — అతను 'ఛ ఛ అప్పుడే తెల్లవారింది' అంటగా విసుక్కొన్నాడు. ఆ మాట బహిర్జీవితానికి సంబంధిధించింది గనుక, రికార్డు నుండి నేనే తొలిగించాను. ఇంతకు మినహా ఇందులో నేను చేసింది ఏమీాలేదు. దయచేసి ఒక్క క్షణం ఆగండి. ఇంతసేపటి నుంచి అంటున్నట్టు......అతని పేరు తురంగ రావు కాదు. ఆ పేరు నేనే పెట్టాను. అతని చిత్తవృత్తిని ప్రతిబింబించటానికి, ఆ పేరు సరిపోతుం దనుకున్నాను. అతని అసలు పే రేమిటంటారా? . ఓ. లింగారావు, రామ లింగారావు, రంగారావు, పాండురంగారావు ... ఏదైనా కావచ్చు, ఇవన్నీ కాకనూపోవచ్చు

# ఆత్మగతం

## పాత్రలు:

ప్రయోక్త
వైకుంఠం
నీలకంఠం
ఇన్స్పెక్టరు
స్త్రీ
భార్య

### ప్రయోక్త

ఎండ మండిపోతున్నది. గాలి గోలపెడుతున్నది. వైకుంఠం చటుక్కున ఆగిపోయాడు. చొక్కా గుండీలు విప్పాడు. జుట్టు సరిదిద్దుకొన్నాడు. పెదిమ కొరుక్కున్నాడు. గోళ్ళు గిల్లుకొన్నాడు. మీసాన్ని పంటిక్రిందికి లాక్కున్నాడు. దభీమని కాలితో నేలను తన్ని, ముందుకు నడిచాడు. వైకుంఠం చిత్రమైనమనిషి. అతను ఇంటివద్ద బయలుదేరినప్పుడు ఏదో అనుకొన్నాడు. అందుకోసం బయటకు వచ్చాడు. ఎండ మండిపోతున్నప్పుడు, గాలి గోల పెడుతున్నప్పుడు, వైకుంఠం వీధిలో నడుస్తున్నాడు. అప్పటికే చాలామంది అతని చుట్టూ మూగారు. వైకుంఠం వాళ్ళను పరిశీలనగా చూశాడు. అతని కెక్కడ లేని ఉత్సాహము పుట్టుకొచ్చింది. ఆ ఉత్సాహంలో....మృగాలు బైట పడ్డాయి.

వైకుంఠం : సోదరులారా! పరమేశ్వరుని భక్తులారా! దయచేసి అందరూ నిశ్శబ్దంగా కూచోవాలని ప్రార్థిస్తున్నాను. అయిపోవచ్చింది. చిత్రాతిచిత్రమైన ఈ నాటకం ఇంత వరకూ మీరు కని, విని ఉండరు. వేషాలు వేసుకోవటం

పూర్తి అయింది. ఒక్క నిమిషం - ఒకే ఒక్క నిమిషం ఓపిక పట్టండి. నాటకం ప్రారంభించ బోతున్నారు. దయ చేసి అందరూ కూర్చోవాలి.

(నాటక ధోరణిలో) సత్యా! దీనికే ఇంత ఆశ్చర్య పొందనేల? అబ్బాయి! అయిదున్నర వాయించు.

కొన్ని గొంతులు : హోయ్...హోయ్...హోయ్.

వై : (దీనంగా) నవ్వుతున్నారు గదూ మీరు...? నవ్వండి నా బ్రతుకింత నవ్వులపాలవుతుందని నేననుకోలేదు. నాకే మనిపిస్తున్నదంటే - ఇంతమందిని నవ్వించ గలిగిన నేను-యెంత గొప్పవాణ్నో అని. కానీ, మా ఆవిడ నవ్వితే మట్టుకు నాకు మండిపోతుంది. నవ్వుతున్న దాని ముఖానికి, తారు పూయాలనిపిస్తుంది.

ఎగతాళి గొంతు : ఏమనిపిస్తుంది స్వామీ...?

వై : శుభం. ఇంతవరకూ మీరీ కార్యక్రమాన్ని శ్రద్ధగా చూచినందుకు, మీ అందరికీ నా ధన్యవాదాలు. తరువాత కార్యక్రమం వెంటనే ప్రారంభమవుతుంది.

ప్రయోక్త

అంటూ వైకుంఠం రెండు చేతులూ చాపి, అల్లాబిల్లీ తిరిగాడు. జనం గొల్లుమని నవ్వారు. అతన్ని చూస్తూ చాలామంది నిలబడిపోవడం వల్ల ట్రాఫిక్ ఆగిపోయింది. సుంపుకు రెండువైపులా కార్లు, జట్కాలు, రిక్షాలు, సైకిళ్ళు ఆగిపోయాయి. అర్జంటు పనిమీద హడావుడిగా వెళ్ళిపోయే ఓ ఆఫీసరు, ఆలస్యాన్ని సహించలేక హారన్ కొట్టాడు. జనం తొలిగారు. దోవ యిచ్చారు. కారు మెల్లిగా పోతున్నది. వైకుంఠం కారువెంట పట్టాడు. దానితోబాటు కొంతదూరం పరుగెత్తి, ఒక్క దూకుతో వెనక కూచున్నాడు. సరే - కొండొక కాలానికి కారు ఆగింది. కారుతోబాటే వైకుంఠం గూడా, అంతలోకి అతనికొక సరికొత్త ఆలోచన కలిగింది.

వై : ఈ దరిత్రంతో నే నెంత కాలం జీవించను...? ఎన్ని బాధలని అనుభవించను ? అట్టే శ్రమ లేకుండా ఒక నిధి దొరికితే బాగుండును. పోనీ, నేను రైల్లో వెడుతున్న ప్పుడు – నే నెక్కిన పెట్టెగాక–మిగతావన్నీ తలక్రిందు లైతే యెంతో బావుంటుంది. అందరి దగ్గరా డబ్బు పోగు చేసుకోవచ్చు. దేనికైనా అదృష్టముండాలి. కలిసివచ్చే గీత వుండాలి.

ఒకరు : ఏమిటోయ్ వైకుంఠం!...యేదో గీత ఉండాలంటు న్నావు. ఏమిటది...?

వై : ఆఁ! ఏమిటీ నువ్వనేది నీలకంఠం...?

నీల : ఏదో గీత ఉండాలంటుంటేను – అదేమిటోనని అడుగు తున్నానోయి.

వై : గీత ఉండట మేమిటి ?

నీల : నువ్వే అంటున్నావు గదటోయ్ యిప్పుడు ?

వై : ఇప్పుడు నే నా మాట అన్నానా నీలకంఠం ? ఎవరు చెప్పారు నే నన్నానని ?

నీల : నేను విన్నాను.

వై : (బిగ్గరగా) ఎప్పుడు విన్నావ్ ?

నీల : (గొంతు తగ్గి) ఇప్పుడే గదటోయ్ నువ్వన్నది. పైగా కళ్లెర్రజేస్తావేం ?

వై : (మామూలుగా) ఇదిగో నీలకంఠం....ఒక్క విషయ మడుగుతాను, నిజం చెబుతావా ?

నీల : నేను నీ కెప్పుడన్నా అబద్ధాలు చెప్పానా వైకుంఠం ?

వై : నాకు తెలుసు – నువ్వు నా శ్రేయోభిలాషివి. నాతో అబద్ధమాడవు. నీకు తెలుసుగదూ ?

నీల : ఏ విషయం వైకుంఠం ?

వై : (యేడ్పు గొంతుతో) అదే–ఆ విషయమే. నీకు తెలుసు గదూ ?

నీల : ఎందుకలా విచారిస్తావోయ్ వైకుంఠం ?...విచారించి మనమేమీ చేయలేం. ఊరుకో...ప్రమాణ పూర్తిగా నాకా సంగతే తెలియదు. ఇన్నిటికీ నువ్వంటున్నది దేన్ని గురించి ?

వై : అదే...పరకాయ ప్రవేశం.

నీల : (నవ్వి) హారి నీ అసాధ్యం కాలిపోను పరకాయప్రవేశం గురించి నాకేమి తెలుసోయ్ ?

వై : అబద్ధమాడుతున్నావు. నీకు తెలుసు.

నీల : తెలియదు.

వై : నీకు తెలుసు.

నీల : నిజంగా నాకు తెలియదు వైకుంఠం.

వై : అయితే – ఆ మాట నీ కెల్లా తెలిసింది ?

నీల : ఏ మాట ?

వై : 'గీత' అన్న మాట.

నీల : (నవ్వి) నువ్వేగదటోయ్ అన్నావు.

వై : భగవంతుడి సాక్షిగా చెబుతున్నాను. ఆ మాట నే ననలేదు.

నీల : (విసుగ్గా) సరే, పోనియ్. అనలేదులే. నేనే పొరబడి ఉంటాను. మరి, నేను వెడతాను వైకుంఠం. అవతల నాకు చాలా పనులున్నై.

వై : (నిట్టూర్చి) అమ్మయ్య! జిడ్డు పీనుగ, ఎంతకీ వదిలాడు గాదు. వీడి పేరు నీలకంఠమట – నీలకంఠం, పాచిపీనుగ.

నీల : (వచ్చి, కోపంగా) ఏమిట్రా నువ్వంటున్నది?—నేను జిడ్డు పీనుగనా?

వై : ఎవరన్నారు నీలకంఠం నిన్నామాట?–ఆ మాట నిన్నన్న వెధవాయ ఆడ్రసేమిటి?

నీల : (రెచ్చిపోయి) ఈ వేషాలు నా దగ్గర సాగవోయ్ వైకుంఠం. నోటి కొచ్చినట్లు పేలావంటే డొక్క బద్దలు చేస్తాను తెలుసా?

వై : గురవయ్యగారూ...ఎందుకలా నోరు పారేసుకొంటారు? నేను నీ కొట్లో – ఒక్క దమ్మిడీ వెచ్చం గూడా వాడ లేదు. మా ఆవిడ వాడిం దంటావా? అందుకు నే నా బాధ్యుణ్ని. వెనకా ముందూ చూడకుండా, అలా బాకీ పెంచినందుగ్గాను, రేపు దాని దగ్గర గోల్లాడగొట్టి పుచ్చుకో. నేను కాదూ కూడదంటె అప్పుడను. ఎవరో చేసిన తప్పుకు, నా మీద కేక లేయడం భావ్యమేనా గురవయ్యా? భగవంతుడు ఈ పనికి మెచ్చుతాడా?

నీల : దొంగ వెధవ. అన్ని వేషాలు వేస్తున్నావు...వేషాలు. ఒళ్ళు దగ్గరుంచుకొని మసులుకో, లేదా – పోలీసులకు రిపోర్టిస్తాను.

వై : అయ్య బాబోయ్, పోలీసు రిపోర్టే? వద్దు బాబూ వద్దు. దేవాదిదేవా! ఆది మధ్యాంతరహితా! పరాత్పరా! నా తప్పు క్షమించి, నన్ను రక్షించు. నాకు తెలియదు. లేకపోతే, మొన్న రాత్రి నీ సన్నిధానంలో అలా చుట్ట కాల్చను. ఈ పాప విమోచనార్థం, నేను దండకార

ణ్యంలో ఘోరాతి ఘోరంగా తపస్సు చేస్తాను. నాకు ముక్తిని ప్రసాదించండి.

ఒక గొంతు : ఏవఁయ్యోయ్! ఏమిటది? ... నడివీధిలో పద్మాసనం వేసుక్కూచున్నావ్. లే...లే...

మరో గొంతు : పిచ్చివాడు లాగుంది.

వై : అయ్యయ్యో! పారిపోండ్రా పారిపోండి. మిలటరీ వాళ్ళొస్తున్నారు. ఊఁ...త్వరగా...త్వరగా పారిపోండి.

ప్రయోక్త

అంటూ వైకుంఠం పరుగు పుచ్చుకొన్నాడు. రోడ్డు వెనక్కి జారుతోంది, చెట్లు, ఇళ్ళు, బళ్ళు, బిత్తర పోతున్నాయి. కాని వైకుంఠం యెటువైపూ చూడటం లేదు. అత నలా పరుగెడుతూనే ఉన్నాడు. కారుతున్న చెమటను తుడుచు కొంటున్నాడు. అడ్డమొస్తున్న క్రాపును సరిచేసుకొంటున్నాడు. అలా చాలా దూరం పరుగెత్తాడు. విపరీతంగా ఆయాస మొచ్చింది. డొక్కలు యెగిరి పడుతున్నాయి. ఊపిరి పీల్చడమే కష్టమయింది. ఇక నడవనుగూడా నడవలేక పోయాడు. కాళ్ళు గుదులు కట్టాయి. ప్రక్కనే ఉన్న ఓ ఇంటి అరుగును ఆశ్రయించాడు వైకుంఠం.

వై : ఇవ్వాళ ఎవరిముఖం చూశానోగానీ, భలే గండంతప్పించుకొన్నాను. నిజంగా అదృష్టవంతుణ్ని. కాకపోతే, ఆ కిషన్‌లాల్ ఒక పట్టాన నన్ను వొదిలి వుండునా? నేనెంత ప్రయత్నించినా, బ్రతుకు వెళ్ళమారటం లేదు. అప్పులుచేయకా తప్పటంలేదు. ఎక్కడెక్కడి డబ్బూ తిండి క్రింద హాతమారి పోతోంది. ఇక అప్పు లెట్లా తీర్చను?.... చచ్చీ చెడీ — యే మాత్రమో చెల్లువేస్తే, అది కాస్తా వడ్డీక్రింద జమపడి, అసలు అలాగే వుండి పోతుందాయె. సాధ్యమయినంత వరకూ, ఆ కిషన్‌లాల్ గాడికి అంద

కుండా తిరుగు తున్నాను. ఠపీమని వీధిమూల యెదుర య్యాడు. గుప్పెడు దుమ్ము ముఖాన చిమ్మి కాలికి బుద్ధి చెప్పాను. లేకపోతే, యింకేమయినా వుందా? ... నా పరువు నిలువునా తీసేవాడు. అరె .... యిదేమిటీ! ... నా గుడ్డలిలా తడిశాయేం?

ప్రయోక్త

అని వైకుంఠం ముందుకు చూచాడు. చిత్తడిగా వాన, కాటుకలా చీకటి. వైకుంఠం చొక్కా విడిచి పిండాడు. తల తుడుచుకొన్నాడు. బురద చిందింది గావును, ధోవతి అలుగ్గుడ్డలా తయారైంది. గాలి తీవ్రతకు జల్లు వసారాలోకి పడుతుంది. ఇక అక్కడ ఉండటం భావ్యం కాదనుకొన్నాడు. వాన తగ్గేవరకూ, ఈ యింట్లో తలదాచుకోవడం మంచిదనుకొన్నాడు. అనుకొని మెల్లగా తలుపు తట్టాడు. లోపలినుండి—

స్త్రీ కంఠం : ఎవరండీ?

వై : నేనే — నేను.

స్త్రీ : నేననుకొంటూనే ఉన్నాను మీరు తిరిగొస్తారని. ఇందాక నేను వద్దన్నా సినిమాకు వెళ్ళారు. ముద్దగా తడిసిపోయొచ్చారు. నామాట విన్నట్లయితే—వుండండి, లాంతరు తెస్తున్నాను. ఓహో... యెవరండీ మీరు?

వై : మాది చాలా దూరదేశమండీ. ఈ ఊళ్ళో బంధువులున్నారు. చూసిపోదామని వచ్చాను. మధ్యలోనే వాన వచ్చింది. అందాకా, యీ గడపవార నిలుచుంటాను. మీకేమీ అభ్యంతరం లేదుగదా?

స్త్రీ : ఫరవాలేదు. ఇలా లోపలకు వచ్చి నిలుచోండి. వెధవ జల్లు...మరీ లోపలకు కొడుతోంది.

వై : ఈ ఊళ్లో వైకుంఠంగారని — మీకు తెలిసే వుంటుంది.
స్త్రీ : నే నెప్పుడూ చూడలేదండి. మావారు, యెప్పుడో అతన్ని గురించి చెప్పినట్లు జ్ఞాపకం.
వై : అతను నాకు చాలా దగ్గిర బంధువండీ. దూరదూరాల్లో వుండడం మూలాన్ని రాకపోకలు ఆట్టేలేవు. ఈ మధ్య వాడినాన్న జబ్బున పడ్డాడుట. చూచి పోదామనివచ్చాను.
స్త్రీ : క్రొత్తవారు గదా! ఈ రాత్రి ఆ వైకుంఠంగారి యిల్లు కనుక్కోగలరా?
వై : ఉత్తరంలో యింటి అడ్రసు కూడా రాశాడండీ. ఏ బండినో కట్టించుకొని——
స్త్రీ : కాకపోతే, ఈ రాత్రి మా యింట్లో వుండిపొండి. ఉదయమే మావారు పంపిస్తారు. వారు వచ్చే వేళయింది.
వై : ఆహాఁ! ఈనాడు నా జన్మ సార్థకమయింది. ఎన్నో యుగాలనుండి నేను అన్వేషిస్తున్న నా స్వప్నసుందరి, యిక్కడ యిలా ప్రత్యక్షమైంది. ఓహో......యేమి సౌందర్యం, యేమి తారుణ్యం?
స్త్రీ : (భయంతో) ఎవరయ్యా నువ్వు...ఏమిటా మాటలు. మనిషివి కాదూ....? వానలో వున్నావుగదా అని — లోపలకు రానిస్తే — యిదటయ్యా నువ్వు చేసేపని?
వై : ఇదుగో చూడండమ్మా! ఇక్కడ — మీరు — నేను తప్ప, యెవ్వరూ లేరుగదా, మీరీ మాటలన్నీ యెవరినంటున్నట్లు?
స్త్రీ : ఎవరన్నా వుంటే—నీ వీపు యెప్పుడో బద్దలయివుండేది. ఊఁ...ముందు బైటికి నడువ్. లేకపోతే, నలుగుర్ని పిలిచి, గడ్డి పెట్టిస్తాను.

వై : ఎందుకలా కోపగించుకొంటారండి?

స్త్రీ : నోర్ ముయ్. ముందు బైటికినడు. ఊఁ...నడువ్... దొంగవెధవ. ముచ్చిలాగా వచ్చి....యివిట్రా నువ్వు అన వలసిన మాటలు. నేను నీ స్వప్నసుందరినా, నాకోసం వెదుకుతున్నావా...? తాగుబోతువెధవ .... తాగుబోతు వెధవాని....

వై : (దీనంగా) అమ్మతోడమ్మా! భగవంతుని సాక్షిగా చెబుతున్నాను. ఒట్టు వేసుకుంటున్నాను. నేనామాట అనలేదండీ.

స్త్రీ : సరేలే వెళ్ళు. లేకపోతే, నలుగుర్నీ పిలిచి...

వై : (రుద్ధ కంఠంతో) లేదు. లేదు. నేనామాట అనలేదు. ముమ్మాటికి అనలేదు. మనసులో అనుకొన్నాను. అంతే. ఊరికే — మనసులో అనుకొన్నాను. నా ఆలోచనలన్నీ అందరూ వింటున్నారు. నా స్వగతాలు ప్రతివారికి విని పిస్తున్నాయి. హాయ్యో! నే నెలా బ్రతకను? ఏమి చెయ్యను. నే నెక్కడో చెడిపోయాను. ఎక్కడో తప్పియాను. నన్ను కాస్త వెదకండి. వెదికి నన్ను నా కొప్పగించండి.

ప్రయోక్త

అన్నాడు వైకుంఠం. అతను మాట్లాడే ధోరణి చూచి, యింటావిడ జడుసుకొంది. దభీమని తలుపు వేసుకుంది. వైకుంఠం గట్టిగా నిట్టూర్చాడు. భరాలున వీధిలోకి దూకాడు. ఎవరో ధనికుడు వీధిలో హాత్యగావింపబడినట్లు జనం చెప్పుకొంటున్నారు. ఈ జనంలోంచి బైటపడి— యింటికొచ్చేసరికి చాలా ప్రొద్దుపోయింది. అయినా భార్య — అతని కోసం కనిపెట్టుకొని కూచుని ఉంది. అతను తూలుకొంటూ వచ్చాడు. భార్య లేచి —

భార్య : ఇప్పటి దాకా రాలే దేమండీ?

వై : చిత్తం. ఈ పూట కాస్త ఆలస్య మయిందండీ. మా ఆవిడ నిన్న నే పుట్టింటి కెళ్ళిందండీ. అదీగాక నాకు పెద్ద దిక్కంటూ ఎవరూ లేరండీ. అందు చేత, నేనే చెయ్యి కాల్చుకోవలసి వచ్చిందండీ. ఇంకెప్పుడూ లేటుగా ఆఫీసుకు రానండి.

భార్య : (నిట్టూర్చి, దిగులుగా) లేవండి. ఆ తడి గుడ్డలు విప్పి మూల పడేయండి, స్నానం చేదురుగాని.

వై : అని ఆజ్ఞాపిస్తున్నావా? ఈ విధంగా నన్ను హింసించక పోతే, ఒక్కసారి గొంతునులిమి చంపరాదుటే. పీడా వదిలి పోతానుగా.

భార్య : నే నేమన్నా నండీ యిప్పుడు? ఒక వేళ పొరబాటే మన్నా జరిగిందేమో చెప్పండి. సర్దుకొంటాను.

వై : ఇది పొరబాటు కానేకాదు. నువ్వు కావాలనే చేస్తు న్నావు. నేను బ్రతకడం నీ కిష్టం లేదు. నన్ను చంపడానికి, లక్ష రకాలుగా నువ్వు ప్రయత్నిస్తున్నావు.

భార్య : (యేడుస్తూ) రామరామా... యెందుకండీ నన్నలా...

వై : ఛట్...మాట్లాడబోకు...నన్ను చంపాలనే నీకు లేక పోతే, నన్ను స్నానం చెయ్యమంటావా? ఊఁ మాట్లా డవేం?

భార్య : స్నానం చేయమనటం కూడా తప్పేనాండీ? మీ యిష్టం. పోనీ మానుకోండి. నేను వెడుతున్నాను.

వై : ఆగు రాక్షసీ! అక్కడే ఆగు. నువ్వు లోపలి కెళ్ళకు. వెళ్ళావంటే నేను పారిపోతాను.

భార్య : (వెక్కి వెక్కి పడుతూ) ఇదంతా నా ఖర్మ.

వై : (ఓర్పుగా) ఊరుకోవే పిచ్చిదానా, ఏడ్చి లాభమేమిటి? వాళ్ళు లక్షాధికారులు. అందుకని ప్రతివాళ్ళను చులకనగా చూస్తారు. మరి డబ్బు మదం అలాంటిది. అదృష్టం కలిసి వచ్చి, యీ వ్యాపారంలో మన మనుకొన్న లాభం వచ్చిందంటే యిటువంటి కుంకల్ని నీ వాకిటి ముందు కాపలా కుంచుతాను. ఏడవకు. ఏది – ఇలా నా వేపు చూడు – ఒక్క నవ్వు – చిన్ని నవ్వు నవ్వు. చాలు ... చిన్ని నవ్వు...ఓ...బస్...యిక వెళ్ళిపడుకో.

భార్య : భోజనానికి లేవరూ?

వై : నాకొద్దు. ఊఁహు....పో...నేను తినను.

భార్య : ప్రొద్దుననగా తిన్నారు. లేవండి వడ్డిస్తాను.

వై : నేను తినలేను. చెయ్యి మంట పుడుతోంది. ఇందాక పంతులుగారు కొట్టారు. అమ్మా! రేపు నేను బళ్ళో కెళ్ళనే. 'పులి – బ్రాహ్మణుడు' పాటమునూ, 'అక్కఱకు రాని చుట్టము' పద్యము నోటికొచ్చేట్టు చదవమంటే ఎట్లా వస్తుందో నువ్వు చెప్పు అమ్మా? రేపు 'మా అబ్బాయిని కొట్టవద్దు' అని పలకమీద రాసి పెట్టవులే అమ్మా! ఇంకెప్పుడూ తిమ్మిరి బిళ్ళలకోసం ఏడిపించనుగా! రాసి పెట్టవా?

భార్య : ఆలాగే. మరి భోజనం.

వై : (మెల్లగా) ఓసేయ్...తరువాత అన్నం తిందువుగాన్లే– త్వరగా ఇలారా. నీకొక మహారహస్యం చెబుతున్నాను. ఎక్కడా పొక్కబోకు. ఇది బైట పడిందంటే, మనిద్దరమూ రవీమని ఎగిరి పోతాం. జాగ్రత్త. నేనిప్పుడే రమణయ్యను చంపి వస్తున్నాను.

భార్య : (భయపడి) ఎవర్ని చంపారు? ఎప్పుడు చంపారు?
వై : (మెల్లగా) ఇశ్శో...మెల్లగా మాట్లాడవే. గోడలకు చెవులుంటాయి. రమణయ్యను చంపేశాను. అందుకే ఇంత ప్రొద్దు పోయింది. ఇంటి వారందరూ నిద్ర పోయిందాకా ఉండి, మెల్లగా లోపలి కెళ్ళాను. రమణయ్య ఇనప్పెట్టెదగ్గరే పడుకొన్నాడు. అమాంతం వాడి పీక నులిమాను. ఇనప్పెట్టెలో ఉన్న డబ్బంతా మూట కట్టుకొని, — అప్పటికీ జాగ్రత్తగానే వస్తున్నాను. వాకిట్లో ఉన్న జవానుగాణ్ని తొక్కాను. వాడు అరిచేలోపుగానే, కత్తితో పొడిచి, పడగొత్తుకొచ్చాను. ఇంద—ఈ నోట్లు, జాగ్రత్తగా దాచిపెట్టు. రేపు ఎవరన్నా వచ్చి అడిగితే — నీ కేమీ తెలీనట్లుగానే వుండు. సరేనా...? మరి, నేను వెళ్ళి పడుకొంటాను ... ఇదుగో ... ఒకసారి నా చేతులు చూడవే.
భార్య : ఇదేం ఖర్మమండీ, ఇవి నోట్లు కావు — నాటకం కాగితాలు.

(తలుపు తట్టిన చప్పుడు)

వై : చూడవే! బాబోయ్ ఆ చప్పు డేమిటో!
గొంతు : (బైటనుండి, తలుపు తడుతూ) తలువు తీయండి. ఎవరండీ. ఇంట్లో...? త్వరగా....తలుపు తీయండి.
భార్య : ఎవరో తలుపు కొడుతున్నారు.
వై : అని ఊరుకొంటావేం...? వెళ్ళి, తీసి రారాదూ?
భార్య : ఇంత రాత్రివేళ, మనింటి తలుపు కొట్టేదెవరా—అని.
వై : వెళ్ళి చూసొస్తే తీరిపోయేదానికి, మీనమేషాలు లెక్కిస్తావేమే?

గొంతు : (గంభీరంగా) ఏమండోయ్ ... పిలిచేది మిమ్మల్నే తలుపు తీస్తారా తియ్యరా ?

వై : (భార్యతో) నీ కంత భయంగా ఉంటే, నే వెళ్ళి తీస్తాను. (తీసి) ఎవరది ? ఏమోయ్ దీపం కొంచెం హెచ్చించు. ఓహో... కాన్‌స్టేబిల్‌గారా....ఏమి టిలా దయచేశారు ?

ఇన్స్‌పెక్టర్ : కొంచెం పనుండి బయలు దేరాను. చూడండి.. మీ పేరేమి టన్నారు...!

వై : వైకుంఠమండి.

ఇన్స్ : ఇంటి పేరు...

భార్య : (భయంగా) ఎందుకండీ ?

ఇన్స్ : మీరు మాతో పోలీసు స్టేషన్‌కు రావాలి.

భార్య : (విహ్వలయై) అమ్మయ్యో...పోలీసు స్టేషనుకే.

వై : ఎందుకండీ ?

ఇన్స్ : నేను గోడ చాటునుండి అన్నీ విన్నాను. రమణయ్య సొమ్ము దొంగిలించారు. అతన్నీ, అతని జవానునూ చంపారు. మీ రనుకొంటున్నవి, యెవ్వరూ వినలేదను కోకండి సార్.

భార్య : (హతాశయై) అయ్యో ! భగవంతుడా !

వై : ఎప్పు డనుకొన్నాము ?...మీ రెప్పుడు విన్నారు?.... ఎందుకండీ అలా గాలిని పోగుచేయుటం ?

ఇన్స్ : (ఉగ్రుడై) షటప్, ముందు పదండి స్టేషన్‌కు. నన్నే అబద్ధీకుణ్ని చేస్తున్నా రంటే మీరు సామాన్యులు కాదు.

వై : (క్షణమాలోచించి పిచ్చిగా నవ్వి) ఓహ్హో....అబ్బా... అదా మీరంటున్నది ?....చచ్చాం పొండి. నే నింకేమిటో అనుకొంటున్నాను. నేను 'హంతక చక్రవర్తి' అన్న

డిటెక్టివ్ నాటకంలో హీరో వేషం వేస్తున్నాను సార్. నేచురల్‌గా యాక్టు చేయడంకోసం, యింటి దగ్గరే రిహార్సల్ చేస్తున్నాను. ఈ ఘట్టంలో హంతకుని భార్యకు ఆక్టే పోర్షన్ లేదు. ఆ రెండు డైలాగ్సూ, మా యింటి దాన్ని అనమని, నేను ప్రాక్టీసు చేస్తున్నాను. ఇంతలోకి మీరు పిలిచారు. అయితే, నేను చాలా రియల్‌గా యాక్టు చేశానన్నమాట. అవునా సార్? ఏమేవ్ నాటకం కాగితాలు చూపించు వారికి.

ఇన్స్ : (చకితుడై) క్షమించండి. నేనిదంతా విని ఏదో అనుకొన్నాను లెండి.

వై : అట్లా అనిపించడంలోనే నిజమైన కళవుంది. డ్రామానాడు మీకు ఫ్రీ పాసులు పంపిస్తాను. తప్పకుండా రండి.

ఇన్స్ : ఓ యస్. తప్పకుండా వస్తాను. ఇంత రాత్రివేళ మిమ్మల్ని డిస్టర్బ్ చేసినందుకు మీరేమీ అనుకోకండి. నేను వెళుతున్నాను. మళ్ళీ మీరు రిహార్సల్ చేసుకోండి. గుడ్‌బై మిస్టర్ వైకుంఠంగారూ.

ప్రయోక్త:

అంటూ పోలీసులు వెళ్ళిపోయారు. మళ్ళీ ఎర్ర టోపీలు చూచిం తరువాతగానీ వైకుంఠం మామూలు మనిషి కాలేదు. నిజంగా వైకుంఠం రిహార్స్ చేస్తున్నాడనే వారు నమ్మారు. భార్య నిర్విణ్ణురాలయి చూస్తున్నది, తన భర్త విచిత్ర ప్రవర్తనకు.

# దూరపు కొండలు

పాత్రలు :

బసవయ్య     శకుంతల
భాస్కరం     నరసమ్మ
నారాయణ     అనసూయ

(సాయంత్రం 5 గంటల వేళ భాస్కరం గదిలో)

బసవయ్య : అయితే చూడండి మీ పేరేమి టన్నారు ?

శకుంతల : భాస్కరంగారని రెండువందల సార్లు చెప్పాను. మళ్ళా ఇప్పు డడుగుతుంటివి. మరీ ఇంత మతి మరుపైతే ఎలా నాన్నా ?

భాస్కరం : (కోప్పడు తున్నట్లు) ఇశ్శో ! ఏమిటది శకుంతలా ? పెద్దవాడు జ్ఞాపకంలేక అడిగాడే అనుకో. అలా విసుక్కోవచ్చా ?

బస : (చటుక్కుని) అన్నట్లు మీ ఇంటిపేరు పెద్దిభొట్లవారే కదూ ?

భాస్క : అవునండీ!

బస : ఇక ఆ బెడదగూడా లేదు. (సాగదీస్తూ) పోతే మరి... ఇంకా వివాహం... చేసుకో లేదేం నాయనా ?

శకుం : (నవ్వు నాపుకొంటూ) పెద్దిభొట్లవారయితే పెళ్ళి చేసుకోకుండా ఉండగూడదా నాన్నా ?

బస : అదిటమ్మా నా మాట కర్థం ? మేకరిక మేమన్నా ఉన్నదేమో ? అందుకోసం ఒక వేళ ఆగి ఉన్నాడేమో...

భాస్క : (చప్పరించి) అల్లాంటి పేచీలేమీ నాకు లేవండీ!...

బస : బహుశా మేనమామలు లేరనుకొంటాను.

భాస్క : లేకేమండీ? ఇద్దరున్నారు.

బస : అదృష్టవంతులు వాళ్ళు. అందరూ మొగపిల్లలే అయి ఉంటుంది.

భాస్క : కాదండీ! ఆడపిల్లలు కూడా ఉన్నారు. అయితే చాలా చిన్నవాళ్ళు.

బస : అంటే — మీరిక బైట పిల్లను చేసుకోవలసిందే నంటారు.

భాస్క : వివాహం చేసుకోవటమే జరిగితే, బైట విచారించవలసిందే నండీ. అందులోనూ నా చిన్నతనంలోనే తల్లీ తండ్రీ పోయారు.

బస : (సానుభూతిగా) విన్నాను — నాయనా — విన్నాను. మా శకుంతల చెప్పింది...ఎవ రెవరికి, ఎంతెంత కాలం, ఈ భూమిమీద నూకలుంటే అంతంత కాల ముంటారు. తరువాత గుట్టు చప్పుడు గాకుండా దాటి పోతారు.

భాస్క : అంతేనండీ మీ రన్నమాట నిజమే!...

శకుం : ఇప్పు డెవరు కాదన్నారు భాస్కరం?

భాస్క : అన్నారని కాదు. అనుకొంటారేమోనని.

(గడియారం గంట కొడుతుంది)

బస : (లేస్తూ) బావుంది. మరి నేను వెళ్ళొస్తాను. అవతల తల మునగా పను లున్నాయి.

భాస్క : అయితే నేను సెలవు తీసుకొంటాను బసవయ్యగారూ! నమస్కారం!!

బస : నమస్కారం. ఉండండి. రా అమ్మ శకుంతలా!

శకుం : నేను సినిమా కెడతాను నాన్నా!

బస : ఒక్క దానివీ వెడతావుటే అమ్మడూ సినిమాకి!

శకుం : నాకేం భయంలేదు నాన్నా!

బస : నీ తలకాయగాదూ? పోనీ భాస్కరంగారు నిన్ను ఇంటి దాకా దిగబెడతారేమో కనుక్కో. అన్నట్టు అసలు విషయం మరిచిపోయాను.

భాస్క : ఏమిటి సార్ అది?

బస : రాత్రికి మా ఇంటికి రండి. భోజనంగూడా అక్కడే చెదురుగాని (వెడుతూ) తప్పకుండా తీసుకురావేవ్ శకుం తలా! (వెడతాడు.)

భాస్క : (గట్టిగా నిట్టూరుస్తాడు)

శకుం : ఏమిటి భాస్కరం?

భాస్క : ఏమీ లేదు.

శకుం : నాతో చెప్పవా? చెప్పగూడని రహస్యమా అది?

భాస్క : నే నాలోచిస్తున్న దేమిటో చెబితే నువ్వు చాలా నొచ్చుకొంటావు.

శకుం : నొచ్చుకోనుగా భాస్కరం! చెప్పవూ?

భాస్క : నువ్విటువంటి దిక్కుమాలిన పని ఎందుకు చేశావా అని ఆలోచిస్తున్నాను.

శకుం : (భయంతో) ఎటువంటి పని భాస్కరం?

భాస్క : (తాపీగా) ఇదేమీ నాన్నను తీసుకురావటం.

శకుం : (తేరుకొని) నేను తీసుకురాలేదు. తనంతట తనే వచ్చాడు.

భాస్క : ఆయనగా రెందుకొచ్చిందీ నాకు తెలుసు. ఈ రాత్రి ఎందుకు భోజనానికి రమ్మన్నదీ తెలుసు. అయినా నువ్విట్లా తెగబడ్డావేం శకుంతలా?

శకుం : నిజంగా నేను తెగబడినట్లయితే, మా నాన్న ఎప్పుడో ఇక్కడికి వచ్చి ఉండేవాడు. చాలామంది కంటే నేనెంతో పిరికిదాన్ని భాస్కరం!

భాస్క : ఏమయినా, నీ వ్యవహారం నా కెంతమాత్రం నచ్చ లేదు శకుంతలా!

శకుం : నచ్చకపోవటానికి నేనేం తప్పుచేశాను భాస్కరం?

భాస్క : చెబుతున్నాను. నువ్వా అబ్బాయిని 'లవ్' చేశావు.

శకుం : ప్రేమించటం తప్పా భాస్కరం?

భాస్క : అంతవరకూ అయితే తప్పులేదు. కానీ ఆ వెంటనే వాణ్ని పెళ్ళాడే సెయ్యాలని ఆరాట పడుతున్నావు. అందు కోసం మీ బాబును పట్టుకొచ్చావు. ఉండు నన్ను చెప్ప నివ్వు. మీ నాన్నగారికి కూడా ఆ అబ్బాయి నచ్చినట్లు గానే ఉంది. మిగతా వాళ్ళు చూడటం కోసరం రాత్రికి భోజనం ఆఫర్ చేసి చక్కా వెళ్లాడు కానీ —

శకుం : ఆఁ... కానీ?

భాస్క : (నవ్వుతాడు)

శకుం : ఏమిటి భాస్కరం నవ్వుతావ్?

భాస్క : (నవ్వుతూనే) నువ్వుగాని, మీ నాన్నగాని ఆ అబ్బా యికి నిన్ను చేసుకోవటం ఇష్టమో కాదో అడిగిన పాపాన బోలేదు. మీ కిష్టమైతే అతగాడికూడా ఇష్టమేనని మీరు ఊహించారు.

శకుం : (ఖిన్నురాలయి) నేనంటే నీకు యిష్టంలేదా భాస్కరం?

భాస్క : (నవ్వి) నీ మీదనే కాదు, నాకు ఆవకాయమీదా, అల్లప్పచ్చడి మీద గూడా ఇష్టమే ఉన్నది. అంత మాత్రాన వాటిని పెళ్ళాడటమేనా?

శకుం : (నొచ్చుకొని) ఎంత నీచమైన ఉపమానం తెచ్చావు భాస్కరం! ఎంతో గాఢంగా నిన్ను ప్రేమిస్తున్నానే!! నన్నేనా అలా అనవలసింది?

భాస్క : లక్ష రోగాలకు పదిలక్షల రకాల మందులున్నాయి గానీ, ఈ ప్రేమ రోగానికి సరైన మందు లున్నట్టు దాఖలా లేదు. ఏ శాస్త్రవేత్తన్నా ఈ మహావ్యాధికి విరుగుడు కనిపెడితే లోకం ఎంతో బాగుపడుతుంది.

శకుం : నువ్విలా మాట్లాడుతావనుకోలేదు భాస్కరం.

భాస్క : అది నా తప్పా?

శకుం : ఎన్నడూ నువిట్లా మాట్లాడలేదు, ఈ రోజు...

భాస్క : మాట్లాడవలసిన అవసరం కలిగింది. మాట్లాడాను.

శకుం : (సంకోచిస్తూ) నా ప్రేమను నువ్వు పరీక్షిస్తున్నావా?

భాస్క : నాకు ప్రేమలో కించిత్ అయినా నమ్మకం లేనప్పుడు పరీక్షించటమనే ప్రశ్నే లేదు....

శకుం : నమ్మకమేలేదా భాస్కరం?

భాస్క : లేదు. ఆ మాటకొస్తే ప్రతి దానయ్యకూ ప్రేమించే హక్కుగూడా లేదంటాను. మనిషి దగ్గరున్న డబ్బును బట్టి, ఆ వ్యక్తికి ప్రేమించే యోగ్యతలు పెరుగుతుంటా యని నా నమ్మకం.

శకుం : భాస్కరం! తుచ్ఛమైన డబ్బుకు, నిర్మలమైన అనురాగానికి సంబంధ మేమిటి?

భాస్క : (ఉలిక్కిపడి) ఏమిటీ? డబ్బు తుచ్ఛమైనదా? నువ్వు లక్షాధికారి కూతురువు గనుక నీకు డబ్బు శక్తి తెలీదు. నా మట్టుకు నాకు డబ్బుకంటే, సాధించవలసిన పరమార్థంగూడా లేదు.

శకుం : (బరువుగా నిట్టూర్చి) అమ్మయ్య! ఇప్పటికి తెలిసింది...(సీదాగా) ఈ కాస్త విషయం చెప్పటానికి ఇంత ఉపోద్ఘాత మెందుకు భాస్కరం?

భాస్క : నువ్వు దేన్నిగురించి అంటున్నదీ నాకు తెలియటం లేదు.

శకుం : నేను తెలుసుకొన్నాను. కట్నం కావాలని నీకుంటే మా నాన్నతో చెప్పి ఇప్పిస్తాను.

భాస్క : అబ్బే నా ఉద్దేశ్యం అదికాదు.

శకుం : తప్పుకోవాలని చూడకు భాస్కరం! ఆ మాట నాతో చెప్పడానికి బిడియ మెందుకు?

భాస్క : నన్ను నువ్వు ఆవిధంగా అర్థం చేసుకొన్నందుకు విచారిస్తున్నాను శకుంతలా.

శకుం : (విసుగ్గా) అది కానప్పుడు అసలు విషయ మేమిటో చెప్పరాదూ?

భాస్క : ఏమీ లేదు.

శకుం : ఇన్నిటికీ నన్ను పెళ్ళాడటం నీకు ఇష్టమా కాదా భాస్కరం? చప్పున తేల్చు.

భాస్క : ఇష్టం లేదని చెబితే నువ్వు మానేస్తావా? మానెయ్యవు. ఎందు కిష్టం లేదని ఎదురు ప్రశ్న వేస్తావు.

శకుం : మరి ప్రతిదానికీ ఒక కారణమంటూ ఉండి ఛస్తుంది గద.

భాస్క : ఉంటుంది. అయితే నేను చెప్పే కారణాలు కూడా విను. ఏమిటంటే ప్రేమ కేవలం భ్రమలాంటిది. కొన్ని కొన్ని పరిస్థితులలో అట్లాంటి భ్రమలు పుడుతుంటాయి. ఆ పరిస్థితులు పోగానే ఆ భ్రమలూ పోతాయి. ప్రస్తుతం నువ్వాటువంటి భ్రమలోనే ఉండి నన్ను చేసుకోవాలను కొంటూన్నావేమో? ఆ భ్రమ కాస్తా విచ్చిపోయిన తరువాత, ఇప్పుడున్నంత ఉన్నతంగా, అప్పుడు నేను ఉండనేమో!

శకుం : అబ్బబ్బా, రానివాటిని గురించి వస్తాయేమోనని, ఇప్పుడే విచారించమంటావా భాస్కరం?

భాస్క : నేను నీ క్షేమంకోరి చెబుతున్నాను, శకుంతలా! ఇందుకు నీకేమీ అభ్యంతరం లేకపోతే, నాకు లేదు. నీలాంటి అందగత్తెను భార్యగా చేసుకోవటానికి నాకేమీ నిషేధం లేదు.

(అదే రాత్రి బసవయ్యగారింట్లో)

నారాయణ:(విసుగ్గా) చెబితే అర్థంచేసుకోవేమిటి అమ్మా? నువ్విప్పుడు కాదన్నంతమాత్రాన అమ్మడు భాస్కరాన్ని చేసుకోవటం మానుతుందా?

నరసమ్మ : నువ్వు లక్ష చెప్పినా సరే ఆ కూబిగాణ్ని శకుంతల చేసుకోవటం నాకే మాత్రం ఇష్టం లేదురా అబ్బాయ్?

శకుం : (కోపంగా) అయితే ఈ పెళ్ళి నీ ఇష్టం లేకుండానే జరిగిపోతుంది. అయినా — నీ యిష్టం మెవరికా్కవాలి? ఎవరిడిగారు నిన్ను? అనవసరంగా నువ్వీ విషయంలో జోక్యం కలుగజేసుకోకే అమ్మా! నాకు చిత్తైత్తు కొస్తే మంచిదాన్ని కాదు.

నర : (ఖిన్నురాలయి) నాకు తోచిందేదో నేను చెప్పాను.

శకుం : (కోపంగా) ఎవరు చెప్పమన్నారని చెప్పావంట ?

నర : (ధీమాగా) ఏమిటేవ్ శకుంతలా ? మరీ ఇంత బరి తెగించావేం ?

నారా : అమ్మా! నీదంతా అడివిమేళం, కాకపోతే దాని సంగతది' చూచుకోలేదుటే ? శకుంతల చిన్నదీ చితకదీ కాదాయె! అయినా దాని పెళ్ళి గొడవలో మనకేం సంబంధమే ?

నర : కన్న వాళ్ళకుగాక, పరాయి వాళ్ళకు సంబంధ ముంటుందట్రా నారాయణా !

నారా : ముఖ్యంగా దాని కుంటుంది.

నర : అదొక దేభ్యాన్ని చేసుకుంటానంటుంది. మన మొప్పుకొంటామట్రా ?

నారా : (నవ్వి) ఇంత పిచ్చిదానవేమే అమ్మా! దేభ్యంగాణ్ని శకుంతల మట్టుకు ఎందుకు చేసుకొంటుందే ?

నర : ఎందుకయినా చేసుకొంటుంది.

శకుం : నేనంత వెర్రిబాగులదాన్ని కాదు.

నర : ఇప్పుడు చేసుకొంటానంటున్నవాడు, ఘనుడా ఏమిటీ?

శకుం : (నిట్టూర్చి) కామెర్ల రోగికి ప్రపంచమంతా పచ్చగా కనిపిస్తుందట. అట్లాగే అమ్మకు లోకమంతా దేభ్యాలమయంగా కనిపిస్తోంది. కర్మ !

నర : ఇంత బతుకూ బతికి చివరికి నీ చేత మాటలు పడాలి సొస్తున్నది. నిజమేనే తల్లీ ! ... నిజంగా యిదంతా నా కర్మ.

బస : (వస్తూ) ఏమేవ్! భాస్కరం రేపు ఉదయం కాఫీ ఇక్కడే తీసుకొంటాడు. కాస్త పెందరాళే లేచి ఆ సంగ తేమిటో చూడు.

శకుం : (విరక్తిగా) భాస్కరాన్ని రావద్దని చెప్పు నాన్నా! అతని కోసం ఖర్చుపెట్టే కాఫీ మనకింకో పూట వస్తుంది.

బస : (హడలిపోయి) అదేమిటే అమ్మడూ? రేపు నేను లగ్నాలు కూడా పెట్టించ బోతుంటేనూ?

నారా : (మధ్యలోనే అందుకుని) భాస్కరాన్ని చేసుకోవటం అమ్మ కిష్టంలేదు నాన్నా!

బస : చేసుకొనేది శకుంతలయితే, మీ అమ్మ కిష్టం లేకపోతే మట్టుకేం?

నర : (విసురుగా) చాల్లెండి మీ ఎద్దేవలు, ఎవరన్నా వింటే నవ్విపోతారు.

బస : కాకపోతే నువ్వంటున్న దేమిటే? పెద్ద తనం వస్తున్న కొందికీ, మరీ నీకిట్లాంటిపాడుబుద్ధులు పుడుతున్నాయేమిటా అని? అతగాడు ఇవ్వాళ 'ఊఁ' అంటే పదివేలు కట్న మిచ్చి, కాళ్ళముందు కన్నెను పడేసే వాళ్లున్నారే! దమ్మిడీ అడక్కుండా చేసుకొంటా నన్నందుకు వాడు నీకు చేదయ్యాడా?

నారా : కట్నం ముఖ్యంకాదు నాన్నా. నువ్వెన్ని లక్షలు పెట్టి తెచ్చినా ఆ తెచ్చినవాడు శకుంతలకు నచ్చు తాడనే గ్యారంటీ యేదీ?

బస : ఈ భాస్కరాని కేం తీపర మొచ్చిందీ? లక్షణంగా బి. కాం. పాసయ్యాడు. వెనక బాదరబందీ లేదు. మనిం ట్లోనే పడుంటాడు, మనతో బాటే ఉన్న దేదో తింటాడు.

నారా : ఆ మాటా నిజమే నాన్నా. తెలిసో తెలియకో అమ్మ ఏదో అంటుంటుంది. ఆమె మాటలకేం గానీ, నువ్వే మేరేజ్ సెటిల్ చేసెయ్యి నాన్నా.

బస : (వెక్కిరింపుగా) ఆఁహాఁ సెటిల్ చెయ్యక, ఈ రాణి గారి ఆర్డర్ కోసం కాచుకూర్చుంటాను!

(కొన్ని రోజుల తరువాత - బసవయ్యగారి మేడమీద)

శకుం : నేను చాలా అదృష్టవంతురాలిని భాస్కరం!

భాస్క : (హాస్యంగా) తమరు పరాకు చిత్తగిస్తున్నారు. ప్రస్తుతం నేను మీ భర్తను. నన్ను పేరున పిలవటం భావ్యంకాదని మనవి.

శకుం : రెండు సంవత్సరాలనుండీ నేను నిన్ను అలానే పిలుచుకొన్నాను భాస్కరం!

భాస్క : అదుగో మళ్ళా నన్ను భాస్కరమంటున్నావు.

శకుం : క్రమంగా పిలవడం మానేస్తాను. కానీ నువ్వు మట్టుకు —

భాస్క : భర్తను నువ్వు అని పిలవవచ్చా?

శకుం : పోనివ్వు భాస్కరం!

భాస్క : అదుగో, మళ్ళా ఈ భాస్కరంగా డొచ్చాడు. వాణ్ణి పీకేసి ఆ స్థానంలో 'మీరు' ను చేర్చలేవా శకుంతలా?

శకుం : నీ అందంలాగానే, మాటలుగూడా ఎంతో హాయిగా ఉంటాయి భాస్కరం—ఎక్స్‌క్యూజ్ మి...హాయిగా ఉంటాయండీ! అందుకే మిమ్మల్ని చూడాలని, మీ మాటలు వినాలని నా ఫ్రెండ్స్ ఆరాట పడిపోతుంటారు.

భాస్క : ఓహో!...

శకుం : నీవంటివాణ్ని భర్తగా సంపాదించినందుకు...

భాస్క : (నవ్వుతాడు)
శకుం : మీకు నవ్వులాటగానే ఉంటుంది. కానీ ఆ పెళ్ళి సెటిల్ కావడానికి ఎంత శ్రమపడ్డానో నాకు తెలుసు.
భాస్క : పోనీ ఒక పని చెయ్యి. ఓ శుభముహూర్తాన, చిన్న మీటింగు చేసి నీ అనుభవాలన్నీ ఉపన్యసించు. మిగతా వాళ్ళ కెందుకయినా అక్కరకొస్తాయి.
శకుం : (ముద్దుగా) ఛీ ఏమిటమ్మా ఆ మాటలు? ఊహు. అలాగైతే నేను క్రింది కెళ్ళిపోతాను... ఊఁ పోనివ్వండి.
భాస్క : పద—నాకూ ఆకలి మండిపోతూంది.
శకుం : అప్పుడేనా భాస్కరం! పొరబాటు...అప్పుడే ఆకలవు తున్నాదాండీ?
భాస్క : పన్నెండయింది.
శకుం : అప్పుడే? మాటల సందడిలో టైమే తెలీలేదు. మీరు కాళ్లూ చేతులూ కడుక్కోండి. ఈలోపుగా నేను భోజనం పట్టుకొస్తాను.
భాస్క : ప్రతిరోజూ నువ్వు భోజనం పైకి తేవడమెందుకు శకుంతలా? నేను దిగి—
శకుం : (గారాబంగా) అదిగాదమ్మా. వెధవ తిండికోసం నిన్ను క్రిందికి రప్పించటం నాకిష్టంలేదు. నేనున్నానుగదూ తేవటానికి.
భాస్క : అఁహఁ. అందుగ్గాదు అనవసరంగా...
శకుం: అనవసర మేమున్నదండీ ఇందులో? ఇప్పుడు గాకపోతే, ఇక నా ముచ్చట తీర్చుకొనేదెప్పుడు? మీరేమీ కాదన కండి. ఏం సరేనా? వెళ్ళనా?

(ఆరునెలల తరువాత మేడక్రింద)

శకుం : (కూనిరాగం తీస్తుంటుంది)

నర : అమ్మాడూ! మీ ఆయనకు భోజనం పట్టుకెళ్లావులే?

శకుం : (రాగం తీస్తూనే ఉంటుంది.)

నర : నిన్నే నే శకుంతలా.

శకుం : (విసుగ్గా ఆపి) ఏమిటీ గోల?

నర : భాస్కరానికి భోజనం పట్టుకెళ్ళావా అని...?

శకుం : ఏమో? సరిగ్గా జ్ఞాపకం లేదు. పట్టుకెళ్ళే ఉంటాను. లేకపోతే కిందికి దిగివచ్చేవాడేగా?

నర : అదేమిటే తల్లీ అట్లా అంటావు? దగ్గరదగ్గర మూడు కావస్తున్నది. పాపం ఆ అబ్బాయి ఎంత ఇదయిపోతున్నాడో ఏమో? ఇలారావే నేనన్నా పెట్టిస్తాను.

శకుం : అయినా మూడుగంటలప్పుడు అన్నం తినడమేమిటో నాన్సెన్స్...

నర : పోనీ ఇంత పలహారమన్నా తీసుకెళ్ళవే.

శకుం : (విసురుగా) ఏమోనమ్మా. రోజుకు పాతికసార్లు క్రిందికీ మీదికీ నేను తిరగలేను. ఆకలయితే క్రిందికొచ్చి తినిపోగూడదూ? ఆ మేడమీద మునిగిపోయే పనులేమీ లేవుగా?

నర : ఇశ్శో. అరవబోకే తల్లీ! ఆయనవింటే బావుండదు.

శకుం : బాగుండకపోతే ఉండనట్లుగానే ఉంటుంది. మరేమీ ఫరవాలేదు.

నర : కాకపోతే రాత్రికి తనేవచ్చి భోంచేస్తాడులే. కాస్త ఫలహారం తీసుకెళ్ళు.

శకుం : సరే ఇలా తగలెయ్...

(మేడమీద)

శకుం : ఇదిగో...మిమ్మల్నే ! కాఫీ తెచ్చాను, లేవండి.

భాస్క : (నిద్రలేచి) ఎవరది ? (ఆవలించి చిటికవేసి) ఏమిటి శకుంతలా ?

శకుం : ఇదిగో టిఫెన్.

భాస్క : ఈ పూటకు నువ్వేమీ తీసుకురావేమో ననుకొన్నాను. మంచిదానివే! కాఫీ ఫలహారమూ గూడా తెచ్చావు. పొరబాటు. నేనే నిన్నుగురించి తప్పుగా అంచనా వేశాను.

శకుం : బాగానేవుంది వరస. తీసుకురానని ఎందుకను కొన్నారూ ?

భాస్క : పన్నెండు గంటలకు భోజనం తీసుకురాని మనిషి, మూడుగంటలకు కాఫీ తెస్తుందని నే నెలా అనుకోను శకుంతలా ?

శకుం : ఎవరన్నా వింటే నిజమనుకొంటారు గానీ, ఇక మాట్లాడకండి. నేను భోజనం తేలేదుట, వీరు తిన లేదుట...తినిగూడా తినలేదనటానికి మా వాళ్ళేం మెగ్గు చేశారండీ మీకు !

భాస్క : నువ్వు మాట్లాడుతున్నది ఈ రోజును గురించే అయితే — తేలేదనే అనాలి.

శకుం : ఏమో నాకు సరిగ్గా జ్ఞాపకం లేదు. అయినా భోజనం పైకి పట్టుకురావడమేమిటీ అసహ్యం ! మీరే ఆ రెండు మెతుకులు తినొస్తే ఏచిక్కూ ఉండదు — నేనేమో ఈ పూట మరిచిపోతిని. పాపం మీరేమో ప్రొద్దున్నించీ—

భాస్క : (నవ్వి) నన్ను క్రింది కొచ్చి తినమనటానికి — ఇంత అభినయం దేనికి శకుంతలా ?

శకుం : పొరపాట్లు ఎవరికయినా ఉంటాయి.

భాస్క : నిజంగా ఇది పొరపాటయితే నేనూ కాదనను.

శకుం : (కోపంగా) కాదులెండి. మెచ్చి మేకతోలు కప్పుతారని మీా ముందు నాటక మాడాను. ముందు మీారా ఫలహారం తీసుకోండి. నేను వెళ్ళాలి.

భాస్క : వెళ్ళు.

శకుం : టిఫెన్ తీసుకోండీ!

భాస్క : అక్కర్లేదు.

శకుం : (కసిగా) ఆకలి లేదు గావును.

భాస్క : ఉంది. అయినా మానేస్తున్నాను. ఈ టిఫెన్ గూడా తీసుకోకుండా ఉంటే ఎట్లా ఉంటుందో చూడాలను కొంటున్నాను.

శకుం : (చిరాకెత్తిపోయి) మంచిది. తెలుసుకోవాలని మీాకంత ఉబలాటంగా ఉన్నప్పుడు నేను వద్దనటం భావ్యంగాదు... ఆ పళ్ళెము, గ్లాసులు ఇలా ఇవ్వండి. వెడతాను.

భాస్క : ఆహా, నిరభ్యంతరంగా పట్టుకెళ్ళు.

(క్షణం విరామం)

భాస్క : ఏం మరిచిపోయావ్ శకుంతలా ... మళ్ళా వచ్చావెందుకు ?

శకుం : రాత్రికి మీారు భోజనం చేస్తారో లేదో అడుగుదామని వచ్చాను. అవసరం లేకపోతే ఇప్పుడే చెప్పండి. పైకీ క్రిందకీ తిరిగే భారమన్నా నాకు తప్పుతుంది.

భాస్క : రాత్రికి నేను భోజనం చేసేదీ లేనిదీ ఇప్పుడే ఎలా చెప్పను శకుంతలా? మరొక అరగంటకు నువ్వు మంచి నీళ్ళు తాగేదీ, లేనిదీ ఇప్పుడే చెప్పగలవా? లేదు. నా స్థితిగూడా ఫక్తు అలాగే ఉన్నది.

శకుం : (విసుగెత్తిపోయి) ఇన్నిటికీ మీరనేదేమిటండీ?

భాస్క : (నొక్కుతూ) ఏమీ లేదు. నువ్వు తప్పకుండా, అన్నం తీసుకురా, తినటమో తినకపోవటమో అప్పుడు చెబుతాను.

(మేడక్రింద)

బస : అమ్మడూ! అమ్మడూ!!

శకుం : (వస్తూ) నువ్వింకా ఆఫీసు కెళ్ళలేదా నాన్నా?

బస : ఏం ఆఫీసో ఏమి బండలో? అంతా మహా అరణ్యం లాగుంది.

శకుం : ఏం జరిగింది నాన్నా?

బస : అయిన వాళ్ళు పట్టించుకోకపోతే, ఏమైనా అవుతుంది... నిన్నటికి నిన్న, ఆ గుమాస్తా కుంక పాతిక రూపాయలూ జేబులో వేసుకొని, చిల్లర ఖర్చుక్రింద రాశాడు. సమయానికి నేను చూడబట్టి సరిపోయె. లేకపోతే, ఆ పాతిక రూపాయలకూ రెక్కలొచ్చేవి గదా?

శకుం : ఇట్లా ఎన్నిసార్లు, ఎంతెంత మొత్తాలు దాటవేశాడో మనకు తెలియదు గదా?...

బస : (ఛట్టున అందుకొని) అదేనమ్మా శకుంతలా! ... నా అనుమానం గూడా అదే!! మన వాడొకడు అక్కడుంటే, వాడా ఛండాలపు పనిచేస్తాడా?

శకుం : కావాలంటే మట్టుకు, ఇప్పుడు మనకెవరు దొరుకు తారు నాన్నా ?

బస : ఎవరో ఒకరు ఆట్టే కష్టం కాదు. మన సొమ్మును తన సొమ్ముగా చూసుకొనేవాడు (ఆగి, ఆలోచించి) అన్నట్టు మన భాస్కరం ఊరికే ఉంటున్నాడు గదూ ?

శకుం : అవున్నాన్నా ! ఆయన కెక్కడన్నా ఉద్యోగం చూసి పెట్టగూడదూ ?

బస : నిన్ను అడగమన్నాడా అమ్మడూ ?

శకుం : లేదు. నేనే అడుగుతున్నాను. ఇరవై నాల్గుగంటలూ ఆగది వొదిలి బైటికిరాడు నాన్నా ! దిక్కుమాలిన పుస్తకాలన్నీ ముందేసుకూర్చుంటాడు. చూడటానికి నాకే విసుగేసుకొస్తున్నది. ఆయనకేమీ ఉన్నట్టులేదు.

బస : అయితే ఇంకే ? మరొక గుమాస్తాను కుదుర్చుకొన్న దాకా మన ఆఫీసుకెళ్ళమను. ఈ లోగా నే నెక్కడన్నా ఉద్యోగం చూస్తా. రేపట్నుంచే ఆఫీసుకెళ్ళమని చెప్పు.

శకుం : రేపటిదాకా ఎందుకూ ? ఇప్పుడే అడిగొస్తాను. నువ్విక్కడే ఉండు నాన్నా...

(మేడ మీద)

శకుం : ఏమండీ !...

భాస్క : లోపలకు రావచ్చు శకుంతలా ! రా అలాకూచో !

శకుం : నేనొక్క విషయ మడుగుతాను. నిజం చెబుతారు గదూ ?

భాస్క : నీ ధోరణి చూస్తుంటే నేను నిజం చెబుతాననే నమ్మకం నీకేమాత్రం లేదనిపిస్తోంది.

శకుం : రాత్రింబవళ్ళు ఒంటరిగా ఈ గదిలో కూచుంటుంటే, మీకు విసుగెత్తటం లేదుటండీ?

భాస్క : లేదు. అయినా నేను ఒంటరిగా ఉంటున్నానన్న స్పృహ నీ కిప్పుడే వచ్చిందనుకొంటాను?

శకుం : (నిట్టూర్చి) మీతో నేను వాదించటానికి రాలేదు.

భాస్క : మరి హాస్య మాడటాని కొచ్చావా?

శకుం : అందుగ్గూడా రాలేదు. మా నాన్నగారి ఆఫీసులో ఎవరో గుమాస్తా, పాతికరూపాయలు కాజేశాడుట. ఇటువంటివి ఇదివరకు ఎన్ని జరిగిఉంటాయోనని, నాన్న అనుమానిస్తున్నాడు. కాస్త మీరు వెళ్ళి అజమాయిషీ తీసుకోగూడదూ?

భాస్క : అంటే—ఆసొమ్ము మరొకరు ముట్టుకోకుండా, నన్ను కాపలా కాయమంటావు. ఔనా?

శకుం : ఇదేం గ్రహచారమండీ? ప్రతి దానికీ మీ రిలా మాట్లాడతారేం? ఆ సొమ్మంటే ఎవరిది? మనదికాదూ? మన సొమ్మును మనం జాగ్రత పరుచుకోవడంగూడా తప్పేనా?

భాస్క : కాదుగానీ, నువ్వుచెప్పిన దాన్ని గురించి ఆలోచిస్తుంటే నాకు బోలెడన్ని సందేహాలు పుడుతున్నాయి. ఒకటి—ఏదోవిధంగా ఈ గదిలో నుండి నన్ను బైటికి లాగాలని చూస్తున్నావేమోనని. పాపం....నీకల్లాంటి దురుద్దేశం లేకపోవచ్చు. కానీ, నాపాపిష్టి మనస్సుకు అల్లా అనిపిస్తున్నది. రెండు:—నువ్విప్పటికి చిత్రమైన మాట నొకదాన్ని నాలుగైదు సార్లు అన్నావు 'మనసొమ్ము'

'మనలో మనం' 'మన జాగ్రత' వగైరా వగైరా అంటు న్నావు. ఈ'మనం' ఏమిటో అర్థంకావటం లేదు.

శకుం : అర్థం కాకపోవటానికి, నేను దేవభాషలో మాట్లాడ లేదు.

భాస్క : మాట్లాడినా తెలిసిఉండేది. నువ్వు లక్షసార్లన్న ప్పటికీ ఆ ఆఫీసు, ఆ డబ్బు మనది-అంటే, నీది నాదీ ఎట్లా అవుతుందా అని?

శకుం : కావాలనుకుంటే ఏదయినా మనదే అవుతుంది.

భాస్క : నేనిప్పుడు రాజాధిరాజును కావాలనుకొంటే, మరు క్షణంలో అయిపోతానంటావు. ఔనా శకుంతలా? ఇదంతా మనసామ్మేనని నన్ను మభ్యపెట్టి, మీ నాన్నకు అరవ చాకిరీ చేయించాలని నీ అభిప్రాయం.

శకుం : మిమ్మల్ని చాకిరీ ఎవరు చేయమన్నారండీ?

భాస్క : మరి ఉట్టినే కూచోవడానికా నేను ఆఫీసుకెళ్ళటం? అందుకే అయితే ఆపని ఇక్కడే చేస్తుంటెని. ఇంకా ఆఫీసు కెందుకు?

శకుం : తల నొప్పిస్తున్నది. ఇక ఆపండి,

భాస్క : సమాధానం వినే ధైర్యం లేనిదానివి, నన్నెందుకు ప్రశ్నిస్తావ్?

శకుం : 'ఊరికే సోమరిపోతులా కూచుంటాడేం, అని మా నాన్న నాలుగైదుసార్లు లన్నాడు. నాకు తలతీసేసినంత అవమానంగాఉంది. మీకైనా ఆఫీసు వ్యవహారాలు తెలియ నివి గావాయె. మీ రక్కడుంటే, ఆయనకెంతో ఆసరాగా ఉంటుంది.

భాస్క : అయినా నేను వెళ్ళను.

శకుం : తిని కూచోవటం మరిగారు. వెడతారని నే ననుకోవ
టమే తప్పు. మిమ్మల్ని నవలసిన పని లేదు.

భాస్క : నన్ను గురించి చాలా దురభిప్రాయ పడుతున్నావు
శకుంతలా! సోమరితనమంటే నా కెంత అసహ్యమో నీకు
తెలీదు —

శకుం : అయినప్పుడు, మరి ఆఫీసు కెళ్ళటానికి అభ్యంతర మే
మున్నదీ ?

భాస్క : చాలా అభ్యంతరాలున్నాయి. నేను చచ్చేటట్లు
పనిచేసి మీ నాన్న ఇనప్పెట్టెను నింపలేను. ఇప్పటికే
బోలెడంత సంపాదించాడు, అదీకాక, నేను పనిచేసినందు
వల్ల నా కేమి వొరుగుతుందో తెలియదు. నేను ఊరికే
కూచోవటం అంతగా చూడలేకపోతే, ఆ వ్యాపారంలో
నాకు గూడా భాగం పెట్టమను. అప్పుడు నువ్వు చెప్పనవ
సరం లేకుండానే, నా పని నేను చూసుకొంటాను. మరి
వెళ్ళి అడిగిరా పో.

శకుం : (అసహ్యంగా) ఓహో వ్యాపారంలో మీకు భాగం
కావాలన్నమాట ?

భాస్క : ఏం ?

శకుం : ఇంతకాలం వాళ్ళింట్లో ఉండి, వాళ్ళసొమ్ము తిని,
చివరికి వాళ్ళ ఆస్థిలో భాగం కావాలంటున్నారా ?

భాస్క : (ఆశ్చర్యంగా) ఏమిటీ? ఇంతకాలం మనల్ని మీ
వాళ్లే పోషిస్తున్నారని ఇంతవరకూ నాకు తెలీదు సుమా !

శకుం : మన మేమన్నా ఇచ్చి తింటున్నామా ? చాటు చాటుగా
మీ రేమన్నా ఇచ్చారేమో నాకు తెలియదు.

భాస్క : ఇచ్చాను – ఎంత హీనంగా చూసుకొన్నా, పదివేల రూపాయల కట్నం పుచ్చుకోవలసినవాణ్ని నేను. ఆయ నింట్లో, ఆయనకు అల్లుడుగా ఉంటున్నాను. అందుకోసం పదివేల రూపాయలు ఆయన నాకివ్వాలాడు. ఇంత వరకూ చిల్లి కాని నాకివ్వలేదు. ఆ మొత్తంలోంచి ఓ వెయ్యి రూపాయలు మన క్రింద ఖర్చు పెట్టి ఉండొచ్చు. అంత మాత్రాన అది ఆయన సొమ్మెలా అవుతుంది?

శకుం : మీరు సిగ్గూ శరమూ లేకుండా మాట్లాడుతున్నారు. మీకు లేకపోయినా, నాకవి ఉన్నాయి. (వెళ్ళుతుంది)

భాస్క : ఆఁ ఆఁ మెల్లిగా వెళ్ళు. నా మీది కోపంతో రెండేసి మెట్లు ఒకేసారి దిగి, కాళ్ళు విరుచుకోకు శకుంతలా! నువ్వే బాధపడాలి.

(మేడక్రింద)

బస : విన్నానమ్మా విన్నాను! ఈ మెట్లమీద ఉండి అన్నీ విన్నాను.

శకుం : (దీనంగా) అంతకంటే ఆయనతో ఇంకేం చెప్పమంటావు నాన్నా ?

నర : ఎల్లాగైతే నేం? ఘనమైన అల్లుణ్ణే తెచ్చారు. ఇప్పు డనుభవించండి.

బస : ఈ త్రాపి ఇట్లా అవుతాడని నేను మట్టుకు అనుకొన్నా నుటే? చదువుకొన్న వాడు గదా, వెనక అండా దండా లేనివాడుగదా, ఏదో మనలో ఒకడుగా ఉంటాడను కొన్నాను గానీ ...

నర : ఉండక ఇప్పుడే ఊరేగుతాననటం లేదుగా అబ్బాయి!

బస : ఇంట్లో కూచోబెట్టి మేపటం నా చేతగాదు.

నర : అయితే అమ్మాయిని అతనితో పంపేయండి. వాళ్ళ తిప్పలు వాళ్ళు పడతారు.

బస : నువ్వు వంద సంవత్సరాల క్రిందట పుట్టవలసిన దానివే!...నా కర్మకాలి ఇప్పుడు పుట్టావు. అమ్మాయిని పంపితే వాడేమయిపోయినా శకుంతలైనా ఎక్కడుంటుంది? ఏం తింటుంది?

నర : (నిష్ఠూరంగా) వందయేళ్ళతర్వాత పుట్టవలసిన వాళ్లేగా ఇది చేసింది, ఇట్లా తగులడ్డ దెందుకని? వాణ్ని చూడం గానే, నాకు దౌర్భాగ్యుడల్లే కనిపించాడు. ఆ సంగతి తెలుసుకోవటానికి మీకు సంవత్సరం పట్టింది. పైగా నన్ను వాజమ్మను చేస్తున్నారు.

బస : (మాట తప్పిస్తూ) అయితే ఇప్పుడేం చేదామే?

శకుం : ఏమి చెయ్యటానికైనా ఆయన కలిసిరాడు నాన్నా!... ఉత్త సోమరిపోతు. శుద్ధ కబుర్ల రాయుడు. ఛీ ఛీ. ఇటు వంటతన్ని మా ఆయనని చెప్పుకోవటానిగ్గూడా అభిమాన పడి ఛస్తున్నాను.

నర : అసలీ గొడవంతా తెచ్చిపెట్టింది నువ్వు!

శకుం : నేనేం తెచ్చానమ్మా?

నర : ఇంకేం తేవాలి? వీణ్ని ప్రేమించానంటివి. వీణ్ని తప్ప మరొకణ్ని చేసుకోనని మొరాయిస్తివి. పెళ్ళి చేశాం. అది కాస్తా అయింతరువాత వీడు కొండెక్కి కూచున్నాడు.

బస : అదీ నిజమే శకుంతలా! నువ్వు పట్టుబట్టక పోయినట్లయితే, ఈ సంబంధం చేసేవాణ్ని కాదు.

శకుం : తెలిసో తెలియకో నేనన్నమాట నిజమే! అంత మాత్రాన మీరెందు కొప్పుకోవాలి?

బస : నువ్వు మనస్సు కష్టపెట్టుకొంటావనుకొన్నాను.

శకుం : చిన్న పిల్లలు తెలియక చాకుతో ఆడుకొంటామంటారు. ఇవ్వకపోతే ఏడుస్తారు గూడాను. అందుకని పెద్దవాళ్ళెవరైనా ఆడుకొనేందుకు చాకు ఇస్తారా? ఇవ్వరు. కానీ మీ రిచ్చారు. ఆ చాకుతో నేను గాయాలు చేసుకొన్నాను. పైగా నేనేదో తప్పు చేసినట్లు మాట్లాడతారెందుకు?

నర : చిన్నదానివీ, చితకదానివీ అయితే, అలాగే నాలుగు మొట్టి చెబుదుము. ఇరవై యేళ్ళ దానివాయె. ఏమీ తెలియని చిన్నపిల్లవని ఎలా అనుకోమే శకుంతలా?

శకుం : తెలిసిన దాన్నయితే, ఈ భాస్కరాన్ని చేసుకొంటానా? అతన్ని తప్ప, మరొకణ్ని చేసుకోనని మొండికెత్తిననాడే, నే నేమీ తెలియని చిన్నపిల్లనని మీరు గ్రహించి ఉండవలసింది. ఆ పని మీరు చేయలేదు. అందుగ్గాను నే నన్నివిధాలా ఛస్తున్నాను. మీ కేం? మీరు బాగానే ఉన్నారు.

(కొంతకాలం తరువాత మేడక్రింద)

శకుం : ఎందుకురా అన్నయ్యా, నాన్న నీమీద కోప్పడుతున్నాడు?

నారా : ఇంకెవరూ దొరక్క.

శకుం : అదేమిట్రా?

నారా : ఏమో? నాన్ననే అడుగు.

శకుం : నాన్న ఇప్పుడు లేడుగా, పోనీ నువ్వు చెప్పరా!

నారా : పెద్దవాడని గౌరవంగా చూస్తున్నాను. ఆయన కదిలిపు కోవాలని లేదల్లే ఉంది.

శకుం : అసలేమి జరిగిందిరా ?

నారా : చూడవె అమ్మడూ! నీ స్వంత విషయాల్లో మరో కరు వేలుబెడితే నీ కెలా ఉంటుందే ?

శకుం : అయితే నాన్న నీ స్వంత—

నారా : ఆఁ. అక్కడే వచ్చింది పేచీ. తనెక్కడో పిల్లను మాట్లాడాడుట. ఇరవై వేలదాకా కట్నమిస్తా మన్నారుట. ఆ పిల్లనేమో నేను చేసుకోవాలిట.

శకుం : ఇందుకోసం మాటామాటా అనుకోవాలా అన్నయ్యా? పోనీ 'అలాగే నాన్నా!' అనలేక పోయావా ?

నారా : నే ననలేదు.

శకుం : ఆ పిల్లను చేసుకోవటానికి నీకభ్యంతర మేమీ లేదాయె. ఎందుకు సరే ననలేదూ ?

నారా : చాలా అభ్యంతరముంది.

శకుం : అంటే—ఆ పిల్ల నీకు నచ్చలేదా ఏమిరా !

నారా : నచ్చినా నచ్చకపోయినా, అనసూయకు నేను అన్యాయం చెయ్యలేను శకుంతలా!...

శకుం : (దిమ్మరపోయి) అనసూయా, ...ఈవిడెవరు ?

నారా : నేను ప్రేమించిన అమ్మాయి, ఆ గొడవ తరువాత చెబుతానుగాని, ఈ విషయంలో నువ్వు నాకు కాస్త సహాయం చెయ్యాలి అమ్మడూ!...అనసూయను చేసుకోవటానికి నాన్న ఒప్పుకోవటం లేదు. నువ్వెలాగైనా నాన్నకు నచ్చచెప్పవుటే శకూ!...

శకుం : (నిట్టూర్చి) లాభంలేదురా అన్నయ్యా! ఇలాంటి ప్రేమలూ గీమలూ నువ్వేమీ నమ్మకు. మొట్టమొదట

అలాగే ఉంటుంది. ఆ తరువాత చాలా వెగటుపుడుతుంది. నామాట విని, అట్లాంటి పిచ్చిపిచ్చిపనులు మానుకో!

నారా : గడిచిపోయినమాటలు మాట్లాడతావేమే అమ్మడూ! నువ్వు భాస్కరాన్ని చేసుకోవాలని ఎంతప్రయత్నించావో జ్ఞాపకంలేదా? ఎంతమంది చెప్పినా నువ్వప్పుడు విన్నావా?

శకుం : అదంతా ఓ కల. ఆకలలో చూచినవన్నీ, అపురూపంగానే ఉంటాయి. కల దాటి వొడ్డుకొచ్చిచూస్తే చాలా అసహ్యమేస్తుంది.

నారా : అందరి అనుభవాలూ ఒకేరకంగాఉండవు. నీతత్వానికది సరిపడలేదు. కాబట్టి అందరికీ సరిపడదనటం భావ్యంగాదు.

శకుం : నీకు తెలియకపోతే, నన్నుచూసి అయినా నేర్చుకోవేమిరా?

నారా : నువ్వు మంచి ఉద్దేశ్యంతోనే బయలుదేరావు. కానీ ఎక్కడో దోవ తప్పావు. పట్టణాని కెళ్ళడానికి బదులు చిట్టడవిలో కెళ్ళావు. అంతమాత్రంచేత, పట్టణానికి వెళ్ళాలనుకోవటమే తప్పనటం ధర్మంకాదు. నీ అనుభవాన్ని తీసుకొని నేను మంచి తోవలోనే వెడతానేమో? నువ్వు కాదనగలవా అమ్మడూ?

శకుం : (నీరసంగా) కాదనలేను. నువ్వేమయినా అనుకోరా అన్నయ్యా! నాకు చేతనైనంతవరకూ, నీకా అనసూయతో పెండ్లికాకుండా చూస్తాను.

నారా : (రెచ్చిపోయి) ఇదటే నువ్వు నాకు చేసే ఉపకారం? నీకా భాస్కరంతో పెళ్ళికావటానికి ఎంత ప్రయత్నించాను! ఆరోజున నేనుగూడా కాదంటే, ఈ పెళ్ళి నీకయ్యేదే

కాదు. పైగా నీచేత నాన్నకు చెప్పిద్దామను కొంటున్నాను. రేపు ఆయనతోగూడా ఇంతే చెబుతావుగా?

శకుం : ఆఁ. ఇట్లాగే చెబుతాను.

నారా : నువ్వింత కృతఘ్నురాలి వనుకోలేదు.

శకుం : ఆరోజున నువ్వా పట్టుదల చూపకపోయినా, నేను సుఖపడేదాన్నేమో? ఏదో ఉద్ధరిద్దామనుకొన్నావు. గోతి లోకి దించావు.

నారా : నువ్వసలు యేరుదాటి తెప్పతగలేసేరకం. వెధవను-నేనే తెలుసుకోలేకపోయాను...అసూయను నువ్వెందు కొద్దంటున్నదీ నేనర్థం చేసుకొన్నాను.

శకుం : అర్థం చేసుకోలేవురా అన్నయ్యా! నే నెంతో అనుభవంమీందగానీ అది తేల్చుకోలేదు. అందుకోసం బోలెడంత కాలం వృధా చేశాను. అభిమానంగూడా విడిచిపెట్టాను. ఇప్పటిగ్గానీ నాకు 'అసలు' ఏమిటో తెలిసిందికాదు.

నారా : (నవ్వి) శకుంతలా! నువ్వు నాకళ్ళముందు పుట్టిన దానివి. నన్ను మభ్యపెట్టాలని చూడకు. అయినా నిన్నన వలసిన పనిలేదు అమ్మడూ! అసూయపడటమనేది-

శకుం : (ఉలిక్కిపడి) నాకా? ఎందుకూ అసూయ?

నారా : నీకంటే నేను సుఖంగా ఉంటానేమోనని, నువ్వేడిచి పోతున్నావు. నీమాటప్రకారం నీకు సుఖపడే గీతలేదు. ఎదుటివాళ్ళ కుంటుందేమోనని నీ భయం.

శకుం : (ఖిన్నురాలయి)నాకు లేని దురుద్దేశాలన్నీ అంటగడతావేమి అన్నయ్యా?

నారా : మరి నువ్వంటున్న మాటల కర్థమంతేగా?

శకుం : నా మాటల్లో నీకసూయ కనిపించటం నా ఖర్మం. నా రోజులు మంచివిగావు. నే నేది చేదామన్నా అది విష మయి పోతున్నది. నీ ఇష్టం. నువ్వూ నీ అనసూయా ఏ గంగలో దూకినా నాకభ్యంతరం లేదు.

నారా : (ఛటుక్కున నవ్వి) నిమిషం తిరగకముందే వెలితి పడ్డావు. నీలో ఎంత కుళ్ళుమోతుతనం లేకపోతే, మమ్మల్ని గంగలో దూకమంటావుటే నువ్వు ? పైగా నా మేలు కోరుతున్నదానిలాగా అభినయిస్తుంటివి. నిన్నే మనాలి ?

శకుం : పొరపాటు. బుద్ధితక్కువయి ఏదో అన్నాను. నీ ఇష్ట మొచ్చినదాన్ని చేసుకో; నే వద్దనను.

నారా : (ఎకసక్కెంగా) అబ్బే చేసుకోను. మీా ఆజ్ఞను శిరసా వహించి, ఇలా బ్రహ్మచారిగా ఉండిపోతాను. దిగులు పడకండి.

(మేడ మీాద)

భాస్క : నిజంగానా అనసూయా ?

అన : నిజమే నన్నయ్యా !

భాస్క : నువ్వింకా హాస్యంగా అంటున్నావేమో ననుకొన్నాను.

అన : లేదండీ అన్నయ్యగారూ ! పదివేల రూపాయలూ మా నాన్నగారు ఇచ్చారు.

భాస్క : ఆ కట్నమే ఇవ్వకపోతే నారాయణ నీకు దక్కే వాడు కాదనుకొంటాను.

అన : నేనూ అంతే అనుకొన్నాను, భాస్కర మన్నాయ్ !

భాస్క : నారాయణను ఈ విషయంలో నేను నొక్కి చూచాను. నీవంటే చాలా అభిమానం కనబరిచాడు.

కానీ తండ్రిని కాదనలేక పోయేవాడు. ఈ పెళ్ళి విష యంలో అతన్ని అందరూ నిరుత్సాహ పరిచారు.

అన : అందరూనాండి?

భాస్క : ఆహా! ఒక్క నేనే ప్రోత్సహించాను. అందుకనే ఈ ఇంట్లో వారందరూ నన్ను ఆడిపోసు కొన్నారు.

అన : అలానాండి, అన్నయ్యా?

భాస్క : నారాయణ ఘోష వినలేక పోయాను. ఉత్త అర్భకుడు. అనుభవం గూడా లేదు. ఆత్మహత్య చేసు కొంటా నన్నాడు. ముసలాయన్ని పిలిపించి, ఒప్పు కొనేట్లు చేశాను.

అన : అవునుట. వారు చెప్పారన్నయ్యా నాతో.

భాస్క : ముసలాయన ఒకంతట లొంగ లేదమ్మా! ఆయన క్కావలసిందల్లా డబ్బు. అందుకోసం ఏ అఘాయిత్యాని కైనా సిద్ధపడతాడు. ఆయన వ్యాపారి. వస్తువులమీదే కాకుండా మనుషులమీద గూడా లాభాలు పిండుతాడు.

అన : అంతపనీ అయిందండీ అన్నయ్యా! ఉన్న రెండెకరాలు పొలమూ అమ్మి వీళ్ళకు కట్న మిచ్చారు నాన్న.

భాస్క : (జాలిగా) పాపం ఇక వాళ్ళ కాధార మేమిటి?

అన : ఏమీ లేదు. అందుకనే మరొక సంబంధం చూస్తా నన్నాడు మా నాన్న.

భాస్క : అలాగా?

అన : నేనే ఒప్పుకోలేదు. తలొంచుదామని ఒకటి రెండు సార్లు గట్టిగా ప్రయత్నించాను. కానీ — వారిని విడిచి—

భాస్క : ఔనౌను. జీవితంలో అలా అనిపించే స్థితులు కొన్ని ఉంటాయి. (నిట్టూరుస్తాడు)

(అడుగుల చప్పుడు)

అన : ఎవరో వస్తున్నారు భాస్కర మన్నయ్యా! చూసిరానా?

భాస్క : శకుంతల వస్తోంది.

అన : అయితే — నేను వెడతానండీ అన్నయ్యా!

భాస్క : నారాయణ వచ్చే వేళ కాలేదు గదూ?

అన : నీకూ, వదినెకూ మధ్య నేనెందు కన్నయ్యా! వేడు తున్నాను (వెళ్ళింది)

శకుం : (వచ్చి) అనసూయ మీ గదిలో కొచ్చి ఎంత సేపయిందండీ?

భాస్క : ఏమిటి కథ?

శకుం : ఏదో చెవులు కొరుకుతుంటేను—

భాస్క : చెప్పకోకుండా చేద్దామని వచ్చావా?

శకుం : నేనంటే అలా విసుక్కుంటా రెందుకండీ? పోనీ నేను చేసిన తప్పేమిటో చెప్పరాదూ? సరిదిద్దు కొంటానుగదా!

భాస్క : నువ్వు తప్పు పని చేశావని నేనన లేదు.

శకుం : ఒకరన్నారని కాదు. నా అంతట నేనే అనుకొంటు న్నాను. ఒకవేళ — తెలియక — ఏమన్నా చేసి ఉంటా నేమోనని —

భాస్క : (నవ్వి) అసలు నీకా పాడు ఆలోచన ఎందుకు కలి గింది శకుంతలా? నువ్వు నాకేదో చేసి ఉంటావని, నువ్వెందు కనుకొంటున్నావో, నాకర్థం కావటంలేదు. నేనెప్పుడూ అట్లా అనుకోను. అలా అనుకొనే వాళ్ళంటే నేను అసహ్యించు కొంటాను కూడా.

శకుం : మీ చేష్టలు చూస్తుంటే నాకలాగే ఉంది.

భాస్క : ఏమని? నువ్వేదో నాకు అఘాయిత్యం చేసినట్లా?

శకుం : నేనెందు కనుకోవలసి వచ్చిందో చెబుతాను. మావదిన అక్కడున్న దేమో చూడండి.

భాస్క : ఎందుకు ?

శకుం : ఆవిడ వింటే బాగుండదు.

భాస్క : అయితే నువ్వు చెప్పేది నిజమయి ఉండదు.

శకుం : నే నే విషయమూ చెప్పక ముందే, నాది అబద్ధ మంటుంటేరి. ఇక నేను చెప్పిమట్టుకు ఏం ప్రయోజనం ?

భాస్క : నిజం చెప్పటానికి ఒకరిని చూసి భయపడాలని నాకు తెలియదు. నువ్వు భయపడుతున్నావు గనక—అది— సత్యమయి ఉండదని నా అనుమానం.

శకుం : మీరు నిలువునా అనుమానాలతోను, కుతర్కాల తోను, నిండి పోయారు.

భాస్క : దీనిని బట్టి చూస్తే నీ మనస్సు ప్రమాదకరమైన స్థితిలో ఉన్నదనుకోవాలి. అది ప్రతివారిలోనూ దోషాలను, దుర్మార్గాలను పసికడు తున్నది. ఒక బాటసారిని చూచి, దొంగ, అబద్ధాలకోరు, జూదరి, మహాబుషి, తల కొక విధంగా ఊహించిన కథ, చిన్నప్పుడు నువ్వు చదివే ఉంటావు. వాళ్ళకున్న సంస్కారాన్ని బట్టి వాళ్ళు తమను తాము ఆ బాటసారితో పోల్చుకొన్నారు. మరి నీకు ప్రతి వారిలోనూ అనుమానాలు, కుతర్కాలు కనిపిస్తున్నాయి. నీ సంస్కారాన్నే మనాలి ?

శకుం : నా ఖర్మకాలి మీ దగ్గర కొచ్చాను. వచ్చిన ప్రతిసారీ నన్ను హీనపరుస్తూనే ఉన్నారు.

భాస్క : అటువంటప్పుడు నువ్వు రావటం మానేయవచ్చు.

శకుం ; నేను మీకోసంరాలేదు. అనసూయకోస మొచ్చాను.

భాస్క : మరి—నాతో ఛేటీవేళా వెందుకు?

శకుం : మీచేత 'ఛీ—ఛా' అనిపించుకుందామని వచ్చాను. అనిపించుకొన్నాను; వెడుతున్నాను.

భాస్క : నా కోసం రానపుడు — నాతో చెప్పకుండానే వెళ్ళ వచ్చు.

(విరామం, మేడమీద నే అనసూయ .... గది ముందు....)

శకుం : వదినా!

అన : ఆఁ, ఇలారండి.

శకుం : అమ్మ రమ్మంటున్నది వదినా!

అన : ఎందుకండీ?

శకుం : ఏమో నాకు తెలీదు. పిలుచుకు రమ్మంటే వచ్చాను.

అన : ఎందుకు రమ్మంటున్నదో అడిగిరండి. ఆ తరువాత — ఆ పనికి నేను రావటమో రాక పోవటమో, చెబుతాను.

శకుం : అంతవరకూ నువ్వు క్రిందికి రావా?

అన : రవ్వంతమాట కనుక్కోవటానికి — ఇద్ద రెందుకండీ క్రింది కెళ్ళడం?

శకుం : (ఎకసక్కెంగా) అలాగా ... వ్చ ... మరేమీ లేదు వదినా! అమ్మకు వంట్లో బాగాలేదు. ఎక్కడిపని అక్కడే ఉండిపోయింది.

అన : మరి—నాకేమీ తెలియదంటారేం? నేను రాను.

శకుం : రాలేవా వదినా? నీకూ సుస్తీచేసిందా?

అన : రాగలను, కానీ రాను.

శకుం : ఎందుకనో?

అన : ఇంటి పనులు చెయ్యటానికి నేను పనిమనిషిని కాను. పూర్వకాలపువారు అత్తగారికి తెలియకపోతే మీరన్నా చెప్పవలసింది. అదిపోయి, మీరే రమ్మంటారేమి టండీ?

శకుం : (కోపం ఆపుకొంటూ) అయితే, మా అందరినీ పరిపాలిద్దామని వచ్చావా అనసూయా?

అన : నాకా బాధ్యతగూడా లేదు.

శకుం : పోనీ — నీకున్న బాధ్యత లేమిటో చెప్పు. ప్రతిదానికీ నిన్ను పిలవకుండా, నీ పనులొచ్చి నప్పుడే పిలుస్తాను.

అన : అప్పుడు పిలవనవసరమే లేదు. నా అంతట నేనేవస్తాను.

శకుం : ఇన్నిటికీ నువ్వీపూట పని చేయటానికి వస్తావా? రావా?

అన : రావలసిన అవసరం నాకు లేదు. పదివేల రూపాయలిచ్చి మీ అన్నను కొనుక్కున్నది — మీ ఇంట్లో దాసీ పని చెయ్యటానిగ్గాదు. ఆ మాట కొస్తే మీరందరూ కలిసి నాకు చాకిరీ చెయ్యాలి.

శకుం : అందరూ మీ అడుగులకు మడుగు లొత్తాలా అనసూయగారూ?

అన : నా పదివేలు అందరూ తింటే, అందరికీ తప్పదు.

శకుం : ఆ సంగ తేమిటో — ఆనక — మా అన్నయ్య వచ్చి కనుక్కుంటాడు.

అన : అంతవరకూ తమరు విశ్రమించవచ్చు. దయ చెయ్యండి.

(అదే రాత్రి .... మేడమీద)

నారా : అనసూయ మీకు కనిపించిందాండి ?

భాస్క : ఆఁ.

నారా : ఎంత సేపయిందండీ కనిపించి ?

భాస్క : (గంభీరంగా) చెల్లెలు మాటలు విని, ఇందాకనువ్వా మెను కొడుతున్నప్పుడు కనిపించింది. నువ్వు వెళ్ళిన తరువాత, గుడ్డలు సర్దుకొంటూ కనిపించింది.

నారా : గుడ్డలు సర్దుకొంటూనాండి ?

భాస్క : సర్దుకొని, ట్రంకు పుచ్చుకొని, దిగి వెడుతూ కూడా కనిపించింది. ఆ తరువాత ఏమైందో నాకు తెలియదు.

నారా : బహుశా పుట్టింటికెళ్ళి ఉంటుంది.

భాస్క : నీ కోసం, తన వాళ్ళను సర్వనాశనం చేసింది అనసూయ, ఇంకే ముఖంతో పుట్టింటి కెడుతుంది ? వెళ్ళి ఏమని చెప్పుకొంటుంది ?

నారా : బండి కింకా పావుగంట టైముంది. వెళ్ళి తీసుకొస్తాను.

భాస్క : నారాయణ ! పోబోకు. నువ్వెళ్ళినా అనసూయ రాదు. వచ్చినా ఆమెతో నువ్వు సుఖపడలేవు. నీ మనస్సు చాలా ఇరుకైనది. అనసూయవంటి విశాలమైన వ్యక్తికి అందులో చోటులేదు. మీకు ఆత్మలనేవి లేవు. ఉన్నా వాటికి అభిమానం లేదు. ఆత్మాభిమానం ఉన్న ప్రతివాడూ, ఎదుటివారి ఆత్మాభిమానాన్ని కించపరచాలని చూడడు. పైగా గౌరవించాలని ప్రయత్నిస్తాడు. మీకు ఎటుగూడీ లేవుగనక—ఎదుటివారిలో ఉండటాన్ని కూడా

మీరు సహించలేరు. నిన్నూ, నీ చెల్లెల్నీ నేను అర్థం చేసుకొన్నాను. మీ సుఖం, మీ సౌభాగ్యం మీది. ఇతరుల కష్టసుఖాలతో మీకు సంబంధంలేదు. అనసూయ కోసం నువ్వూ, నాకోసం నీ సోదరీమణీ హారం వేశారు. దీనివల్ల, ఎవరెవరు, ఎన్నెన్ని బాధలు పడతారోననే ఆలోచననే మీకు లేదు. ప్రస్తుతం మీ మనస్సులకు బాగా జబ్బు చేసింది. ప్రతివారిలోనూ దోషాల్నే చూపుతున్నాయి. దయచేసి వాటిని కాస్త బాగుచేసుకోండి. అంతవరకూ మీరు సుఖపడరు. ఎదటివారిని సుఖపడనివ్వరు ... సరే నేనూ వెడుతున్నాను. ఈ విషయం శకుంతలతో చెప్పు. నేనే చెబుదామనుకొన్నాను గానీ, బండికి అట్టే టైంలేదు. వెళ్ళొస్తాను నారాయణా! గుడ్ బై.

# 'కవీనాం ....'

పాత్రలు :

సదానందం　　సదానందం భార్య
కథకుడు　　మరో ఆవిడ.
ఆంజనేయులు

కథకుడు : సదానందాన్ని గురించి మీాకు కొత్తగా చెప్పవలసిందేమీా లేదు. అతనికి సంబంధించిన వార్తలను ఈ మధ్య అన్నిపత్రికలూ విరివిగా ప్రకటించాయి. ఆభావుకుల నా పత్రికావిలేఖరు లెందరో అతనిచుట్టూ అందమైనకథ లల్లి వైనవైనాలుగా ప్రచారంచేశారు.

వెలువడిన వార్తల ప్రకారం సదానందం తన భార్యకూ ఇద్దరుబిడ్డలకు విషప్రయోగంచేసి పారిపోతుంటే పోలీసులు వెన్నాడి పట్టుకొన్నట్టుగా అర్థమౌతోంది. అసలువిషయం నా కొక్కడికి తెలుసు. అతను పారిపో లేదు, పారిపో లేదు కూడాను. అలా పారిపోవడం సదానందం ఉద్దేశం కానే కాదు. మొట్టమొదట అతన్ని పబ్లిక్ గార్డెన్ గేటుదగ్గర చూశాను. చిరిగిన పైజామా, డిటోమార్కు చొక్కా, రేగినజుట్టూ, కాళ్ళకు బైరుచెప్పులూ, చేతిలో సిగరెట్ శవం. ఇదీ అతనిఆకారం. నా కెందుకో అతన్ని చాలసేపు చూడబుద్ధేసింది, అప్పుడే ఆంజనేయులు అడిగాడు.

ఆంజనేయులు : ఏమిట్రా అలా చూస్తున్నావ్ ? ఏమున్నదని ?

కథ : ఆ పోతున్నవాణ్ని చూస్తున్నాను. ఎవరతను?

ఆంజ : వాడా!

కథ : అవును, ఎందుకలా చప్పరించేశావ్?

ఆంజ : పిచ్చివాళ్ళను చూడడంలో నీకింత ఆసక్తి ఉన్నదని నాకు తెలీదులే, అందుకే అన్నాను.

కథ : అతను పిచ్చివాడేమిట్రా అంజీ, ఆ లక్షణాలేమీ కనిపించడం లేదే.

ఆంజ : అంటే ఇంకా పూర్తిగా పిచ్చెక్క లేదనుకో. ప్రస్తుతం పిచ్చికి కావలసిన ప్రాథమిక లక్షణాలన్నీ వాడిలో ఉన్నాయి. బాబూ రెండేళ్ళనుంచీ సదానందం నాకు తెలుసు, సరా?

కథ : గావును. నాకు తెలీదు.

ఆంజ : కాకపోతే, వాడు కవిత్వం రాయడమేమిట్రా?

కథ : సదానందం కవిత్వం రాస్తాడా?

ఆంజ : అట. నాకూ తెలియదు. అయితే వాడు రాసిన ఒక్క లైనుగూడా, ఇంతవరకూ ఏ పత్రికలోనూ అచ్చుకాలేదు. సజీవ కవుల్లో ఒక్కడుగూడా, సదానందం రాసేది కవిత్వమని — మచ్చుగ్గూడా వొప్పుకోలేదు. కానీ, వాడిమీద వాడికి అపారమైన విశ్వాసం ఉన్నది. ఎప్పటికో ఒకప్పటికీ తన కవిత్వం, జన బాహుళ్యపుదాపులోకి వెడుతుందంటాడు. ఈ దశాబ్దం ప్రజలకు తన కవిత్వం నచ్చక పోవటంలో ఆశ్చర్యం లేదంటాడు. ఇవన్నీ పిచ్చి లక్షణాలు గాకపోతే, మరేమిటో నువ్వే చెప్పు.

కథ: అన్నాడు ఆంజనేయులు ఆక్షణాన ఆంజనేయులు చెప్పిన దానిమీద ఏలాంటి కామెంట్ చెయ్యడానికీ మనస్సొప్ప

లేదు. కానీ సదానందాన్ని గురించి చాలా చెప్పుకొచ్చాడు. నిజానికి, అతనిమీద రోత పుట్టించాలన్నదే అతని ధ్యేయం అయి ఉంటుంది. కానీ, అతనితో మాట్లాడాక సదానందం మీద, నాకు ఎనలేని అనురాగం పుట్టుకొచ్చింది. ఎలాగైనా సదానందాన్ని కలుసుకోవాలని నిర్ణయించుకొన్నాను. ఎవడి నడిగినా, నవ్వుతాడే గానీ, అడ్రసు మాత్రం చెప్పేవారు కారు. సమకాలీన సమాజం చేత ఇంతగా వెలివేయబడ్డాడంటే, సదానందం నిజంగా చాలా గొప్పవాడన్న మాట. అతిప్రయత్నంమీద అతని ఇంటి అడ్రసు కనుక్కొని ఓసారి వెళ్ళాను.

(సదానందంగారు ఉన్నారా ? అని అడిగాను.)

భార్య : ఎవరు నాయనా నువ్వు.
కథ : వారితో పనుండి వచ్చాను.
భార్య : లేరు.
కథ : ఎప్పుడొస్తారమ్మా ?
భార్య : తెలీదు.
కథ : ఎక్కడికి వెళ్ళారో చెబుతారా ?
భార్య : తెలీదు.
కథ : అదేమిటండీ.
భార్య : అంతకన్నా నాకేమీ తెలీదు.
కథ : వారు, ఇంటికి రారా అమ్మా ?
భార్య : ఎప్పుడోగానీ రారు.
కథ : ఎందుకని.
భార్య : తెలీదు.
కథ : ఎన్ని రోజులైంది వారు ఇంటికొచ్చి ?

భార్య : నాలుగు వారాలైంది.
కథ : ఎప్పు డొస్తారో. అసలు వస్తారో రారో గూడా తెలీదు గదూ?
స్త్రీ : (వస్తూ) ఏమమ్మా, మీ ఆయన వున్నాడా?
భార్య : రాలేదు పిన్నిగారూ.
స్త్రీ : అదేమిటమ్మా, ఉదయం వస్తే ఇస్తానన్నావు గదూ?
భార్య : అన్నాను పిన్నిగారూ.
స్త్రీ : మరి నన్ను వేగిరం పంపించు తల్లీ, వెళ్ళాలి.
భార్య : డబ్బింకా అందలేదు పిన్నిగారూ. రాత్రి వెడితే ఉదయం రమ్మన్నారు. అందుకని వారు. కప్పర కప్పర చీకటుండగానే వెళ్ళారు.
స్త్రీ : ఏమిటమ్మా ఈ లక్కోకరు మాటలు? పొద్దునొస్తే సాయంత్రమనీ, సాయంత్రమొస్తే పొద్దుననీ, నాలుగు నెల్లనించీ తిప్పుతున్నారు గదా! మీరు కడుపుకు తినేది అన్నమా? గడ్డా?
భార్య : ఎందుకు పిన్నిగారూ,అనవసరంగా మాటలనుకోవడం.
స్త్రీ : పైగా నాది అనవసరమంటూ వేమిటమ్మా. చూడయ్యా బాబూ. ఇవ్వాల్సిన అద్దె నాలుగు నెలలనుంచీ పేరుకు పోయి ఉంది. అడిగితే కోపం...
భార్య : ఇస్తాంలే పిన్నిగారూ. ఆగినంత కాలం ఆగారు. ఇంకో రోజు ఆగండి. మీ డబ్బంతా ముద్దర సుద్దిగా ఇస్తాం.
స్త్రీ : అమ్మాయ్. నాతో వసవసలు పనికిరావు. సాయంత్రము వస్తాను, ఇస్తే సరేసరి. లేకపోతే బైటికి గెంటి, తలు పేస్తాను.
భార్య : అమ్మయ్య. వెళ్ళిపోయింది.

కథ : సాయంత్రంవస్తే ఏం చేస్తారమ్మా?

భార్య : తెలీదు.

కథ : ఆవిడన్నంత పనీ చేస్తేనో?

భార్య : చెయ్యనివ్వండి బాబూ. అన్నింటికీ, ఆ భగవంతుడే ఉన్నాడు.

కథ : ఆ విశ్వాసం కుదురుకొన్న మనిషితో వాదించి లాభం లేదని నాకు తెలుసు. అంచాతే ఆమెకు నా అడ్రసు చెప్పి వేశాను. ఇది జరిగిన వారం రోజులకల్లా సదానందం నాగది కొచ్చాడు. నన్నడక్కుండానే చాపమీద కూచున్నాడు. సిగరెట్ పెట్టందుకొని ముట్టించాడు. అలా ప్రారంభమైంది మా పరిచయం. అతనితో గంటలు గంటలు కబుర్లాడుతూ కూచుసేవాణ్ని. మీరు నమ్మరు గానీ, సదానందంతో మాట్లాడటమంటే – జీవితంలో ఓ అపూర్వమైన అనుభవం అన్నమాట. మనం చూడని, అనేక కొత్త కోణాలనుండి, అతను బ్రతుకును చూపి, అందులోని వెలుగు నీడలను, లోతు పాతులను చక్కగా తన రచనలలో పోజ్ చేసేవాడు. మీరేమయినా అనుకోండి. సదానందం నిస్సందేహంగా రేపటికవి. అతని అముద్రిత రచనలెన్నో నావద్ద భద్రంగా ఉన్నాయి. తగిన సమయం వచ్చినప్పుడు, వాటిని గ్రంథరూపంలో నేనే వెలువరిస్తాను. భావి సారస్వత ప్రియులకు, ఓ అమూల్యమైన ఆమెతగా ఆ సాహిత్యం ఉంటుందనడంలో నాకేలాంటి సందేహములేదు. ఓసారి అతని భార్యాబిడ్డలను గురించి ప్రస్తావించాను.

సదా : నాకో భార్యంటూ లేదు. కానీ నా భార్యకో భర్త న్నాడు. నాకు పిల్లలంటూ లేనే లేరు. కానీ నా పిల్లలకు నాన్నున్నాడు.

కథ : నేనేమీ మాట్లాడలేదు. క్షణమయ్యాక సదానందమే ఇలా అన్నాడు.

సదా : భార్య, పిల్లలు, సంసారం, సంపాదన వీళ్ళంతా ఓ పెద్ద జాతర. ముఖ్యంగా నాలాంటివాడీ బంధనాల్లో ఇమడలేడు. అలా ఇమడటం నా అభిమతంగూడా కాదు.

కథ : 'కానీ చాలామంది ఉంటున్నారు. మీ రెందుకలా ఉండలేక పోతున్నారు? ఎందుకిలా మొండికెత్తి పోతున్నారు?' అన్నాను. సదానందం పావుగంటదాకా మాట్లాడలేదు. అదేపనిగా సిగరెట్ కాల్చాడు. సిగరెట్ పొగతో గదంతా నిండిపోయింది. ఆఖరుకు బాధగా నవ్వుతో ఇలా ప్రారంభించాడు.

సదా : మొదటినించీ, నే నిలా మొండికెత్తలేదు. జీవితంతో రాజీపడదామనీ, పరిసరాలతో సరిపెట్టుకుందామనీ ప్రయత్నించాను. నేను లొంగినకొద్దీ జీవితం ఫెడీ ఫెడీమని తన్న సాగింది. పరిసరాలు కోరలుసాచి కాటేయసాగాయి. ఓర్పు నశించింది. ప్రచండంగా తిరగబడ్డాను. ఇప్పుడు నన్నందరూ పిచ్చివాడంటున్నారు.

కథ : నేనేమీ మాట్లాడలేదు. సదానందంకేసి తదేకంగా చూస్తున్నాను. అతను మళ్ళీ చెప్పుకుపోతున్నాడు.

సదా : పరిసరాలు గెలిచాయి నేనే ఓడిపోయాను. కానీ అంతిమ విజయం నాదేనని నాకు తెలుసు. ఎప్పటికో

ఒకప్పటికి చేచిక్క-గల ఆ విషయంకోసం నేను ఎదురు చూస్తున్నాను.

కథ : ఒక్క-మాట సదానందంగారూ, సత్యం చివరికయినా గెలుస్తుందన్న నమ్మకం నాకు లేదు. మీకున్నదా?

సదా : ఉన్నది.

కథ : ఈ సత్యం చెప్పడం, నిజాయితీగా బ్రతకడం, నమ్మిన దాన్ని ఆచరించడం అలాంటి సవాలక్ష విధానాలన్నీ మనిషి తనను తాను సముదాయించుకొనే ప్రయత్నంలో వాడే మాటలేమో ననుకొంటాను.

కథ : పరిసరాలతో రాజీపడలేక, ఆ అసమర్థతను ఒప్పుకోలేక, ఆత్మపడే వేదనకే పదాలు, ప్రతిబింబాలు, లక్షలాది మనుషులు సమాజంలో కలిసిపోతున్నప్పుడు ఏ కొందరో ఆ పని చెయ్యలేక పోవడం వారి అసమర్థతే గాని, సమాజం తప్పు కాదనుకొంటాను.

సదా : నే నేకీభవించ లేను.

కథ : ఎంచేతనంటారు?

సదా : మీరు అసమర్థత అంటున్న గుణం, కొందరిలోనైనా లేకపోతే, ప్రపంచం పాతరాతియుగం నుండి, ముందుకు వచ్చేదే కాదు. సమకాలీన సమాజంలో సంఘర్షించు నప్పుడే దానిలో కదలిక మెలకువా ఉంటాయి. మడ్డిగా, గుడ్డిగా, జడ్డుగా ఉండే సమాజం, మేలుకోవడానికి మీరంటున్న ఈ అసమర్థతే కారణం ... ... చాలాసేపు మాట్లాడానా?

కథ : అన్నాడు సదానందం. అతన్ని అనవసరంగా రెచ్చగొట్టానేమో ననిపించింది. సదానందాన్ని మామూలు

మనిషిని చేదామని నా ప్రయత్నం ... ఈ సంభాషణ జరిగిన రాత్రి అతనో పాట లాంటిది రాశాడు. నాకు చదివికూడా వినిపించాడు. సదానందం తన రచన చదివి వినిపించడం అదే మొదటిసారి. దానికి ఏంపేరు పెట్టారు? అని అతన్నడిగాను.

సదా : నీడల కెరటాలు, ఎలా ఉంది?

కథ : నవ్వాను. అభిప్రాయం మాత్రం చెప్పలేదు. ఆ పాట ఇది—

సదా : అర్ధరాత్రి దాటిపోయింది
అంతా సజావుగా జరుగుతోంది
ఆఫీసరుగారి అందమైన బొచ్చుకుక్క
ఆవలించి, ఆయనలా ముడుచుకొంది
ఆయన కలలో అప్సరసలు మెరుస్తున్నారు
లారీలమీద ధాన్యం బస్తాలు
చల్లగా చీకట్లో కెళ్లిపోయాయి
ముఠానాయకుడు, మూడు వే లందుకొన్నాడు
మా పేట వోట్లనీ నీకే ఖాయమన్నాడు
పేమెంట్ నీళ్ళకోసం అరిచాడు
పసివాడు పాలకోసం ఏడ్చాడు
నోట్లకవర్లు పేరులు మారాయి
ఉద్యోగం ప్రామిస్ చేయబడింది
తోడేల్లా ఆకలి రొద చేస్తుంటే
నిరుద్యోగి అటూ ఇటూ మసిలాడు
కల్లుతాగి వొళ్ళు మరిచాడు కార్మికుడు
కడుపులో కాళ్ళెట్టుకుంది అతని భార్య

పిల్లలు అర్ధాకలితో ఆవలిస్తున్నారు
తల్లులు గుండెల కొత్తుకొని జోకొడుతున్నారు
బిచ్చగాడిలా, బిక్కు బిక్కు మంటున్నాడు చంద్రుడు
స్వచ్ఛమైన చరిత్రలా మెరుస్తోంది వెన్నెల
అర్ధరాత్రి దాటిపోయిం దిప్పుడు
అంతా సజావుగా సాగుతూనే ఉంది......

కథ : దురదృష్టవశాత్తూ ఇంతకన్నా ఎక్కువ ఆ పంక్తుల్ని వ్రాడానికి అవకాశం లేదు. ఇందాక చెప్పినట్లు తగిన సమయంలో, సదానందంగారి సంపూర్ణ సాహిత్యాన్ని ఆంధ్ర ప్రజలకు తప్పకుండా అందిస్తాను. అత నా పాట రాసిన వారం రోజుల తరువాత, ఓ నాటి సుప్రభాతాన, ఆంజనేయులు హడావుడిగా నాదగ్గరకు పరుగెత్తుకొచ్చాడు. 'ఏమిటి విశేషం?' అన్నాను.

ఆంజ : ఆ సదానందంగారు ఇక్కడే పడుకొంటున్నాడా?

కథ : అవును. ఏమిటి విశేషం?

ఆంజ : కనీసం ఇప్పుడున్నంచయినా మాన్పించరా?

కథ : ఎందుకని?

ఆంజ : వాడికి పిచ్చి పూర్తిగా పట్టింది. ఉదయం, అబీడ్ కేసి వెళ్ళాను. వాడు రాయిమీద నిలబడి పిచ్చి వాగు డంతా వాగుతున్నాడు. చొక్కాను పీలికలు పీలికలుగా చింపుకొన్నాడు. చేతికండలు, నెత్తురొడిసేలా కొరుక్కున్నాడు.

కథ : ఆంజనేయుల్ని పంపేసి, సదానందం కోసం బయలు దేరాను. సాయంత్రం దాకా ఊరంతా తిరిగాను. కొసకు నాంపల్లి మూలమీద కనిపించాడు. అచ్చు ఆంజనేయులు

చెప్పినట్లుగానే ఉన్నాడు. గొంతెత్తి బిగ్గరగా అరు స్తున్నాడు.

సదా : మహాజనులారా! ఆలసించిన ఆశాభంగం. వెల స్వల్పము. ఫలమధికం. మీరు ఇంతవరకూ, కనివినీ ఎరుగని విషయం. నేను అమ్ముడు బోతున్నాను. నా భార్యనూ, బిడ్డలనూ అమ్మేతాను. కావలసినవారు పాట పాడండి. ఒకసారి. రెండుసార్లు. పాడండి సార్. మంచి లాభం పొందుతారు.

కథ : అంటున్నాడు సదానందం. అతన్ని ఎంతో ప్రయత్నం మీద గదికి తీసుకొచ్చాను. స్నానం చేయించాను. భోజనం పెట్టాను. గాయాలకు కట్టుకట్టాను. ఆ రాత్రే అతనో, 'ప్రహేళిక' రాశాడు. దాని పేరు 'ఇక్కడ మను షులు అమ్మబడతారు' అని. ఆ శీర్షిక సరిగ్గా లేదని, సదా నందానికి నేను సలహాను సరఫరా చేశాను.

సదా : ఎందుకని ?

కథ : బానిస యుగం ఏనాడో అంతరించి పోయింది. సదా నందం! ఇప్పుడు మనం ప్రజాస్వామిక యుగంలో జీవిస్తు న్నాం. ఈ యుగ లక్షణం ప్రతివారూ, సుఖంగా జీవించడం.

సదా: అదేలేదు. బానిసయుగం పోయిందనుకొంటున్నాంగానీ, నిజంగా పోలేదు. మరో పేరుతో, అది ఇప్పటికీ అమల్లో ఉన్నది.

కథ : నా కర్థం కాలేదు.

సదా : భాయీ. అర్థం కాలేదనకు. అర్థం చేసుకోనేందుకు భయపడుతున్నావను. భార్య భర్తకు బానిస, భర్తకు

భార్య బానిస. వీరిద్దరకూ పిల్లలు బానిసలు. పిల్లలు పంతుళ్ళకు బానిసలు, లేనివాడు ఉన్నవాడికి బానిస. ఉన్నవాడు పన్నులకు బానిస. గుమాస్తా హెడ్డుగుమాస్తాకు బానిస. హెడ్డు మా ఆఫీసరుకు. ఇలా ప్రతివారూ ప్రతివారికి బానిసలే. ఈ సత్యాన్ని మనం అంగీకరింపలేం. ఆ చేవలేక, దానికి రకరకాల పేర్లు పెట్టుకొంటున్నాం. ఏమంటావ్ ?

కథ : కాదను కొంటాను.

సదా : నీ ఖర్మ. అయినా, ఆ యుగమే మంచిదేమో ననుకొంటాను. ఆ నాటి బానిసలకు యజమానులు తిండి పెట్టే వారు. గొడ్లలా చాకిరీ చేయించేవారు. ఈ నాడు — చాకిరీ చేయించు కొనేవాడే లేడు. తిండి అంతకన్నా లేదు. అమ్ముడు పోతానన్నా కొనే నాథుడు లేని దురదృష్టకరమైన కాలమిది.

కథ : అతని అభిప్రాయాలతో నేనేమాత్రం ఏకీభవించ లేదు. అతనితో చర్చించనూ లేదు. ఉదయం నేను లేచేసరికి సదానందం ప్రక్క ఖాళీగా ఉన్నది. అత నెప్పుడూ, అలా నాతో చెప్పకుండా వెళ్ళలేదు. బయటికి పోతూ ఉండగా, ఆంజనేయులు రొప్పుకొంటూ వచ్చి నన్ను కావిలించుకొని భోరు మన్నాడు, 'ఏమిట్రా బాబూ?' అన్నాను.

ఆంజ : నువ్వింకా బ్రతికున్నావనుకోలేదురా బ్రదర్. ఆ పిచ్చి వెధవ నిన్నూ చంపేశాడనుకొన్నాను.

కథ : ఎవర్ని చంపాడేమిటి?

అంజ : పెళ్ళాన్నీ బిడ్డల్నీనూ, విషం పెట్టి చంపాట్ట. పారిపో తుంటే, వెంటబడి పోలీసులు పట్టుకొన్నారుట. ఇప్పుడు వాడు జైల్లో ఉన్నాడట. విషంకొనడానికి వాడికి డబ్బెలా వచ్చిందోనని పోలీసులు ఇప్పుడు కూపీలు తీస్తున్నారు.

కథ : అప్రయత్నంగా జేబులు తడుముకొన్నాను. పది రూపా యల నోటు కనిపించలేదు. డబ్బు పోయిందని కాదు గానీ, అదింత ఘోరంగా ఉపయోగించినందుకే నాకు విచారంగా ఉంది. ఆ డబ్బే లేకపోతే అతని భార్యా బిడ్డలకు, అంత తొందరగా మృత్యువు దాపరించేది కాదేమో. ఒక రకంగా ఆ హత్యలకు నేనే పరోక్షంగా కారణ భూతుణ్ణి, నేరస్థుణ్నే తప్ప, అతని పరిస్థితులను అవగాహన చేసుకో నేంత విపులంగా శాస్త్రం లేకపోవడం, సదానందం దుర దృష్టం. నాలుగో రోజున అతను నాకిలా జాబు రాశాడు.

సదా : డియర్, ఫ్రెండ్!

మీకు తెలియకుండా, మీ పదిరూపాయలు తీసుకొ న్నందుకు మన్నించండి. మీ పదిరూపాయలూ నాకు మహోపకారం చేశాయి. నా సమస్యను శాశ్వతంగా పరిష్కరించాయి. ఇప్పుడు నాకు భార్యలేదు. పిల్లలులేరు. వాళ్ళ బాధ్యతలేదు. ఇక్కడ ప్రాణానికి చాలా హాయిగా ఉంది.

ఇక్కడ ఎంత హాయిగా ఉన్నదని? మంచిగది, పక్కకు కప్పుకొనేందుకు గుడ్డలు, తినడానికి వేళ దాట కుండా తిండి, తెల్లవార్లు దీపం, చాలా సంతృప్తికరంగా ఉన్నదీ జైలుజీవితం. ఇలాంటి సుఖంకోసమే నేను చాలా ప్రయత్నించాను. పడరానిపాట్లు పడ్డాను. కనపడిన ప్రతి

వాడినీ యాచించాను. ఆఖరుకు అమ్ముడుబోవడానిగ్గూడా సిద్ధపడ్డాను. ఏమీ లాభం లేకపోయింది. ఇటువంటి కనీస జీవిత సౌకర్యాలే ఇంతకాలంనుండి నేను కోరుకొంటున్నాను. ఇందులో పదోవంతు సౌకర్యాలు నాకు లభిస్తే, వారికలా విషమిచ్చి ఉండను. అయితే ఆ పని చెయ్యడం వల్లనే, నాకీ సదుపాయాలు లభించాయనుకొంటాను. ఏదో ఓ అన్యాయం, అక్రమం, అధర్మం చెయ్యనిదే, మనిషి జీవించలేకపోవడంకన్నా, అధికత్వాన్ని నేను ఊహించలేను. లోగడ మీతో అన్నట్టు—అంతిమవిజయం నాదే అయింది. అయితే ఆ విజయంతాలూకు ఫలితాలను అనుభవించడానికి, నావారంటూ ఎవ్వరూ లేకపోయారు. ఓసారి వస్తారుగదూ! ఉంటాను.

మీ

సదానందం.

కథ : అంటూ అతను జాబు ముగించాడు. పోనీ ఓసారి వెడదామా అనుకొనిగూడా మానేశాను. సదానందం మొఖమెలా చూడను? భార్యాబిడ్డలు చనిపోయారనీ, వారి బాధ్యతలు తనకేమీ లేవనిన్నీ ఆలోచనే, సదానందం ఇప్పుడనుభవిస్తున్న సంతృప్తికి మూలకారణం. కానీ, అతననుకొంటున్నట్లు, వారు చనిపోలేదనీ, ఆసుపత్రిలో క్రమంగా కోలుకుంటున్నారనీ, తెలిసినప్పుడు, సదానందం ఏమౌతాడా అని.

# మనోరథం

**పాత్రలు:**

| | | |
|---|---|---|
| సుందరం | నారాయణ | రాజమ్మ |
| సత్యం | మోహన్ | జానకి |
| జగన్నాథ్ | అతను | |

ప్రయోక్త : మనస్సు చాలా విచిత్రమయింది. అది పోయే పోకళ్ళు, ఇన్నీ అన్నీ కాదు. ఉన్నదొకటయితే, ఊహించేది మరొకటి. జరుగుతున్న దొకవిధంగా ఉంటే, జరగాలనుకొనేది వేరొకవిధంగా ఉంటుంది. నిత్యదరిద్రంతో వేగిపోతున్నవాడు, తీయని ఆలోచనలు ఆలోచిస్తాడు. బంగారుకలలు కంటాడు. సుందరసీమల్లో విహరిస్తాడు. బహిర్జీవితానికి అంతర్జీవితానికీ ఎంతో తేడా ఉంటుంది. ఇది మనందరకూ, తెలిసినవిషయమే! అందరం, ఎప్పుడో ఒకప్పుడు అలా తియ్యని తలపుల్లో తేలిపోయిన వాళ్ళమే! అయితే గియితే అదల్లా జరిగితే, ఇదిల్లా జరిగితే అంటూ భావనాలోకంలో విహరించినవాళ్ళమే. ఆతియ్యని తలపులు, ఎన్ని వయ్యారాలు పోతాయో చూదాం. సుందరం ఆరునెలలనుండీ మంచం దిగడంలేదు. గుండె లవిసిపోయేలా ఒక్కటే మోయిన దగ్గు—

సుంద : (ఖంగు ఖంగున పావునిమిషం దగ్గుతాడు. నెమ్మదిగా కోలుకుంటాడు) అమ్మయ్య ... అమ్మయ్య ... ఈ పాడు

దగ్గుతో, గుండెలు పగిలిపోతున్నాయి. (మళ్ళీ ఖంగున దగ్గుతాడు) జానకీ, జానకీ ... (ఈసారి కాస్త బిగ్గరగా పిలిచాడు. సమాధానం రాకపోవడంతో మరికాస్తపెద్దగా) జానకీ !!

(ఇంట్లో గిన్నెలు, చెంబులు కదిలిన చప్పుడవుతుంది)

సుంద : నిన్నే నే!....

జానకి : (దూరంనుండి) ఓయ్, వస్తున్నాను. (ఒక్కక్షణం ఆగాక, దగ్గిరగా) ఏమండీ! పిలిచారా?

సుంద : అబ్బబ్బా, పిలిచి పిలిచి నా నోరు పడిపోవడమేగాని,... (దగ్గుతాడు)

జానకి : ఇశ్శో, మాటిమాటికి మాట్లాడకండి. డాక్టర్‌గారేమన్నారు?

సుంద : వాడికేం, ఏమైనా అంటాడు.

జానకి : ఏమిటండీ ఆ మాటలు? ఆయన వింటే ఏమనుకొంటాడు?

సుంద : రేపో మాపో చచ్చేవాడికి, ఎవరేమనుకొంటేనేం జానకీ!

జానకి : (ఏడుపు గొంతుతో) మీరిట్లాంటి మాటలనకండి. ఇందుకేనా పనిమాల నన్ను పిలిచారు?

సుంద : (మళ్ళీ ముమ్మరంగా దగ్గుతాడు.)

జానకి : డాక్టరేమో మిమ్మల్ని మాట్లాడొద్దంటాడు. మీరేమో, ఆయన మాటలు లక్ష్యపెట్టరు. ఇలాగయితే జబ్బెలా తగ్గుతుందండీ!

సుంద : జానకీ! (ఒక్కక్షణం ఆగి) ఒక్కమాట నిజం చెప్పనా?

జానకి : మీ రేమీ చెప్పొచ్చనా నా మాట విని కదలకుండా పడుకోండి.

సుంద : (మెల్లగా నవ్వి) జ్జిజబ్బు తగ్గాలని లేదు జానకీ! ఇది తగ్గనూ తగ్గదు.

జానకి : ఇలా అయితే నేనాంోళ్ళపోతున్నాను ...

సుంద : జానకీ! (క్షణం అం దగ్గరగా) జానకీ! ఇలారా!!

జానకి : (దూరంనుండి) హా, వస్తాను. పొయ్యిమీద కూర మాడిపోతున్నది.

సుంద : అయితే పద. నే నుడి కొస్తాను.

జానకి : (గబగబా దగ్గరవు డుల అడుగులసవ్వడి) అయ్యయ్యో, మీ రిలా మొండికెత్తిరగఅనేం చెయ్యనండీ?

సుంద : ఇలా నా దగ్గరగానాం . (దగ్గుతాడు)

జానకి : (అతను తేరుకొనాగద. ఇంద, ఈ బిళ్ళ నోట్లో వేసు కొని, ఈ మందు తాగను

సుంద : వద్దు. ఈ పాడు ు లు నే తాగ లేను. ఇప్పటికే, నా వంటినిండా మందుఅదుపోడిపోయాయి.

జానకి : డాక్టరుగా రేమసంటాం?

సుంద : (కోపంగా) ఏమం)ంట అంటాడు. మందు తాగేది నేనుగాని, డాక్టరు కా క్టలు. నువ్వూ, వాడూ కలసి, ఆరు నెల్లనుండి, నన్ని మంచి కట్టిపడేశారు... (ఆవేశంవల్ల మళ్ళా దగ్గు వచ్చింది.ది

జానకి ; ఈ ఒక్కసారికి నామాట ాట వినండి ... ఈ బిళ్ళ వేసు కొని ...

సుంద : (దగ్గునుండి తేరుకొని) అమ్మయ్య. (ఆయాసపడుతూ) అమ్మయ్య. (క్షణం ఆగి) సమ్మెటతో కొట్టినట్లు గుండెలు పోటెత్తిపోతున్నాయి జానకీ!

జానకి : మెల్లిగా సర్దుకొంటాయిలెండి!

సుంద : ఈమాట, నీనోటినుండి ఆరునెల్లనుండి వింటున్నాను. రోజురోజుకూ రోగం పెరుగుతున్నదేగాని ... (కొన్ని క్షణాలు దగ్గి) అబ్బా, నాకిక దగ్గే వోపికగూడా లేదు జానకీ!

జానకి : తగ్గిపోతుందిలెండి. డాక్టరుగారుగూడా నాతో అదే అన్నారు. కాకపోతే, కొంత టైం పడుతుందన్నారు.

సుంద : దేనికి జానకీ? (జాలిగా నవ్వి) తగ్గడానికా?—దు.

జానకి: (దుఃఖాన్ని ఆపుకొంటూ) మీరిలా మాట్లాడుతుంటే-

సుంద : పిచ్చిదానా, ఎందుకలా కళ్ళలో నీళ్ళు తిప్పుకొంటావ్?

జానకి : (క్షణం ఆగి) కొంచెం వేడిచేసింది...ఊ...మందు తాగరూ — పోసి మీరు 'ఆ' అనండి. నేను నోటి కందిస్తాను.

సుంద : రోగంకంటే, ఈమందులే నాప్రాణం తోడేస్తున్నాయి జానకీ!

జానకి : ఎంతఘాటుమందులు వాడితే అంత త్వరగా తగ్గిపో తుందట...ఊ నామాట వినరూ?

సుంద : 'ఆ'...(మందుతాగి గుటకవేసి) నాలుక బద్దలయి పోయింది జానకీ!

జానకి : మరి నేను వెళ్ళిరానా?

సుంద : (పలకడు)

జానకి : ఇప్పుడే వస్తాను.

సుంద : డాక్టరు డబ్బడగ్గా లేదా జానకీ?
జానకి : మన డాక్టరు చాలా మంచివాడండీ!
సుంద : మందులకు డబ్బెట్లిచ్చావే?
జానకి : కూరకుంపటిమిపటిద్దిది, దించొస్తాను.
సుంద : నీ చేతి బంగారుగాజులు కనిపించడంలేదేం జానకీ?
జానకి : దానికి అతుకూడుదుజాందుకని, అన్నీతీసి పెట్టెలో వేశాను.
సుంద : వారం కిందటిదటిదా వెండిగ్లాసుతో కాఫీ ఇచ్చే దానివి—
జానకి : పనిమనిషిని సని పోకపోయాను. మన జాగ్రత్తలో మనముందామని దాని దాచాను.
సుంద : (బాధగా నవ్వు నూచ్చిదానా, నేను చిన్నవాణ్ని కాదు. వెండిగ్లాసేమైందో, నాకు తెలుసు. నీ గాజు లేమయ్యాయో నాకూ తెలుసు. రేపు నీ తాళిబొట్టు ఏమవు తుందో గూడా నాకు తెలుసు.
జానకి : (అతనామాట పూర్తి చేసేటుండగానే) ఏమండీ, (లిప్త విరామానంతరం) అమంగళాలన్నీ మీకెందుకు చెప్పండి?
సుంద : నువ్వింత అమంగళాలనుకోలేదు జానకీ!
జానకి : ఏం చేశానండీంపో
సుంద : రేపో మాపో పోయేవాడినిగురించి అనవసరంగా డబ్బు వెదజల్లుతున్నావ్. ఛా
జానకి : (బిగ్గరగా) అట్ అలాంటిమాట లనకండి.
సుంద : తప్పకుండా, అన్నదున్నదాన్ని గురించి నేనంటే ఎందుకన్నా అంతః ?

జానకి : ఏమీ జరగదు. మీ జబ్బు తప్పకుండా నయమవు తుంది. ఇదివరకటికన్నా మీరిప్పుడెంత కోలుకున్నారో మీకు తెలీదు.

సుంద : ఇదివరకు గుండెలుపగిలే దగ్గే ఉండేది. నాలుగయిదు రోజులనుండి దగ్గినప్పుడల్లా నెత్తురుగూడా పడుతున్నది. నువ్వూ, డాక్టరు ఎంత చెప్పినా, నా బ్రతుకు రోజుల్లో ఉన్నదని నే నెరుగుదును జానకీ! (ముమ్మరంగా దగ్గువచ్చి ఉక్కిరిబిక్కి రవుతాడు.)

జానకి : ఈ నీళ్ళు పుక్కిలించి ఊయండి.

సుంద : నామాట నువ్వు నమ్మవు. ఇలా దోసిళ్ళకొద్దీ నెత్తురు కక్కుకొనేవాడు ... (అతని కంఠం దుఃఖంతో వణకిపోయింది.)

జానకి : (వెక్కి వెక్కి ఏడుస్తుంది.)

సుంద : ఇలాంటివాడిమీద, అనవసరంగా ఉన్న డబ్బంతా పాడుచెయ్యకు జానకీ! నా తదనంతరం నువ్వు ఎందుకూ కాకుండా పోతావు...కాసిని మంచినీళ్ళందుకో జానకీ!

జానకి : ఇందా!

సుంద : (తాగి) అమ్మయ్య. నీళ్ళు తాగినా గొంతంతా మండి పోతున్నది. ఆ పరంధామయ్యకు ఇలాంటిజబ్బే వచ్చింది. అతనూ ఆరునెల్లపాటు మంచంలోతీసుకొని, ఒకరాత్రి రక్తం కక్కుకొని కళ్ళు మూశాడు...

జానకి : ఆ డాక్టరు మంచివాడు కాదులెండి...

సుంద : జానకీ! (అతనిగొంతు దుఃఖంతో నిండిపోయింది) నాగురించి నాకేవిచారము లేదు. నాతరువాత నువ్వేమవుతా వనే నా బాధంతా.

జానకి : మీరూరుకోరూ ఎకిలఅయినా ఎన్నడూ లేంది ఈ రోజిలా మాట్లాడు తున్నారేం ?

సుంద : ఇంతకాలం నీతోనైనా చెప్పకుండా దాచిన రహస్యం, ఈ అవసానదశలోనైనా నీ చెబుదా మనుకొంటున్నాను జానకీ!! నే చేసిన తప్పన్నా నొప్పుకొని, నిన్ను క్షమాపణ కోరుకొంటే....

జానకి : నేను వెడుతున్నా...

సుంద : నా ఆఖరి దశలో ఒన్నలా ఒంటరిగా చేసి వెడతావా జానకీ!

జానకి : మరి — అలాంటి దు ంటు లనకండి.

సుంద : (ఒక్క క్షణం దది ఉకీరుకొని) నేను నిన్ను చేసుకోకుండా ఉండవలసింది దుురకీ. నీవీ నిర్భాగ్యుణ్ణి చేసుకొని జీవితంలో అనుభవించించియుమీ లేదు. చాలీచాలని జీతంతో అవస్థపడ్డావు. సంతోషంఒఖసుఖం అనేవి మరచిపోయావ్, నిన్ను చేసుకొని నీకు నిక్షు ద్రోహం చేశాను జానకీ!! ఆ పాపమే—

జానకి : (దగ్గరగా) ఏమయి

సుంద : (వినిపించుకోడు) ...లా కట్టి కుడుపుతున్నది... మీ అమ్మ చెప్పినట్టుగా) లు సత్యాన్ని చేసుకున్నట్టయితే— (బాగా దగ్గు వచ్చింది. పిగంగలు తిరిగేలా దగ్గాడు.)

జానకి : నా మాట విని వి పిగి మాటాడకుండా పడుకోండి.

సుంద : మనస్సులో అగ్నిగ్ ండలు పేలుతుంటే, నిద్రెలా వస్తుందమ్మా ?

జానకి : నిద్రపట్టే మందిమడి? ? (ఆగి) ఇంద ఈ గుక్కెడూ త్రాగి కళ్ళు మూసుకో ని. అదే నిద్రొస్తుంది.

సుంద : నీ ఋణం ఎలా తీర్చుకోను జానకీ?

జానకి : నీకు నయమయ్యాక, రవ్వపొదులేసిన నెక్లెస్ చేయించండి. నా కెంత కాలం నుండో దాన్ని చేయించుకోవాలని ఉంది...మరి నేను వెడతాను. మీరు నిద్రపోతారుగదూ!

సుంద : అలాగే. (ఆగి ఆమె వెళ్ళాక) పిచ్చిపిల్ల, ఎన్ని కలలు గంటున్నది!!

* * *

రాజమ్మ : కామాక్షివై ఏకామ్రనాథుని గూడి వామభాగము నందు వన్నెమీరి మోమూన చిరునవ్వు ముద్దులు గులుకూచు క్షేమముతో నున్న శ్రీ కామాక్షమ్మా మంగళం, మంగళం.

ఒకరు : (దూరంనుండి) ఏమండీ!

రాజ : అందమైన గజ్జెలందేలూ ముత్యాలూ సందిటీదండాలు, చొకళింపా.

ఒకరు : (కొంచెం బిగ్గరగా) ఏమండోయ్ !! మిమ్మల్నే !!

రాజ : చందమామవంటి చక్కని మోముతో ఇందూధరుని వద్దా, చిందూలాడెడి తల్లి మంగళం, మంగళం.

ఒకరు : (మరికాస్త పెద్దగా) మిమ్మల్నే నండీ! రాజమ్మగారిల్లేదేనా?

రాజ : (పాటనాపి) ఎవరు నాయనా?

ఒకరు : (దగ్గరకొచ్చి) మాదీవూరు కాదులెండీ! అదేమిటండీ అత్తయ్యగారూ, ఇలా మారిపొయ్యారేమిటి?

రాజ : నేన్నిన్ను గుర్తుపట్టలేదు నాయనా!

ఒకరు : నేనండి అత్తయ్యా, సత్యాన్ని.

రాజ : (ఆశ్చర్యంగా) సత్యవ్రత థ (ఆగి) ఏ సత్యం! ఓరి నువ్వ టోయ్ సత్యం. కోటూ ట డూ వేసుకొంటే కనుక్కో లేకపోయాను...అలా నిూ ఉనే ఉన్నావేం?

సత్యం : పర్వాలేదులెండి. మం

రాజ : ఇలారా. ఆ మంచుంచి కిల్చుకు కూచో, దాహాని కివ్వనా?

సత్యం : అఖ్ఖర్లేదండి.

రాజ : ఇప్పుడెక్కణ్నించి ఉ. నా రావడం. ఇంటి దగ్గర అంతా కులాసాయేనా? ఉ.

సత్యం : ఆc! బాగానే ఉన లే .

రాజ : మిూ నాన్నగారు లేచిగ డుతుతున్నారా!

సత్యం : ఆc, అదే తిరగ డరగ బుం త్తయ్యా.

రాజ : ఇంకా నయం. పెూ యాలం మనిషి గనుక ఇంకా ఆ మాత్రమన్నా ఉన్నానాలంఅన్నట్టు సుబ్బుల్ను ఏ వూరి రిచ్చారు?

సత్యం : రాజమండ్రి అత్తఅ ఇప్ప ఇప్పుడేం దాని పెళ్ళయి మూడేళ్ళయిందిగా?

రాజ : దానికి సంబంధాలు థాeతు ఉు తున్నప్పుడు మేమక్కడే ఉన్నాం.

సత్యం : దాని కిద్దరు పిల్ల పిటలూ్యా!

రాజ : సంతోషం నాయనారయి శ్చులూ, మా జానకీ, ఒక్క ఈడువాళ్ళు. వారం రిలాం వెనకా ముందుగా, మిూ అమ్మా నేనూ, సిల్లోని కీ వ్నాం ... మాదాని రాత అలా అయింది.

సత్యం : విన్నా న త్తయ్యా యా

రాజ : చిన్నప్పట్నించీ ఊళ్ళో వాళ్ళందరూ, మే మిద్దరం వియ్యమందుతామనో నేవాళ్ళు. నేనూ మీ మావయ్యా గూడా అలానే అనుకున్నాం...ఏమాట కామాటే చెప్పు కోవాలి మీ నాన్నకు మాత్రం, జానకిని చేసుకోండా మనే ఉంది సత్యం. మీ అమ్మే పడనివ్వలేదు.

సత్యం : ఏదో అలా జరిగిపోయిం దత్తయ్యా!

రాజ : అంతే నాయనా, అంతే! ఇప్పు డేమనుకొంటే ఏం లాభం! నీకు పిల్ల లెంతమంది సత్యం?

సత్యం : (నవ్వి) పిల్లలా?

రాజ : ఇద్దరా?

సత్యం : (నిట్టూర్చి) నేనింకా పెళ్ళిచేసుకోలే దత్తయ్యా!

రాజ : ఎందుకనీ?

సత్యం : నేను చేసుకోవా లనుకొన్నవాళ్ళు నాకు దూర మయ్యా రత్తయ్యా! ఆ విరక్తితో, అసలు పెళ్ళే మానేశాను.

రాజ : భగవంతుడు మంచి అన్నంలోకి, మంచి కూరివ్వడు సత్యం.

సత్యం : ఇంట్లో ఎవ్వరూ ఉన్నట్టు లేదు — జానకి ఎక్కడి కన్నా వెళ్ళిందా?

రాజ : సుబ్బాయమ్మగారి కోడ లొచ్చిందట, చూసొస్తానని వెళ్ళింది.

సత్యం : నాకైౖ నేననగూడదుగాని, జానక్కి మరో సంబంధం చూడగూడదా అత్తయ్యా!

రాజ : నావల్ల తప్పులేకుండా, ఇద్దరు ముగ్గురుచేత అడిగించా న్నాయనా!

సత్యం : ఏమన్నది ? —

రాజ : తన కిష్టం లేదుట న్నది

జానకి : (దూరంనుండి) స ! సుబ్బాయమ్మగారి కోడ లెంత బాగుందని. నని.). .(దగ్గరకొచ్చి) ఇంత పొడుగు ముఖం, అదీనూ. (ఓదీనూగిపో ఆగిపోయింది)

రాజ : ఏమిటే అలా చూ. .? ? మన సత్యం కాదూ!

జానకి : (వినిపించుకోకుండా) మామయ్య కీమధ్య సుస్తీ చేసిందట. మొన్న నెవరుడు పుచ్చుకొన్నాట్ట.

రాజ : ఎవరన్నారే? మొ

జానకి : సుబ్బాయమ్మగారుముగుగుడు. ఆ కోడల్ది మామయ్య గారి ఊరేగా. ఇల్లఇఁ ఆ ఉా ఆ వీధిలో నేనట.

రాజ : ఏం సుస్తీ అట. నే

జానకి : అవన్నీ నే నడ.

రాజ : వెర్రిపిల్లాని. ఆ ఆఁగే ముక్కేదో గట్టిగా అడిగి రారుటే ?

జానకి : నువ్విలా అంటావ ) కలగన్నానుటే ?

రాజ : నీకు సమాధానం కెచెప్పలేను తల్లీ, ఆ సంగతేమిటో నే కనుక్కొస్తా నుండు

జానకి : పద.

రాజ : నువ్వొక్కడికే?

జానకి : నేనూ వస్తాను.

రాజ : ఇంట్లో సత్యాన్నొక్కణ్ని వదిలా?

సత్యం : అయితే, నేను వవెళ్ళొస్తానత్తయ్యా, సాయంత్రం కనిపిస్తాను.

రాజ : అదేమిటి నాయనా! చెప్పాల్లో కాళ్ళు చెప్పాల్లో ఉండ గానే పోతానంటావేం ?

సత్యం : మీ రెక్కడికో 'పోవాలనుకొంటున్నా' రుగదూ మరి ?

రాజ : అయితేయేం, నువ్వుండవే. నేనిప్పుడే వస్తాను... అమ్మడూ, మాటలసందట్లో కాఫీమాటే మరిచిపోయాను. సత్యానికా కాఫీ పెట్టమ్మా! పంచదార డబ్బా చెక్కమీ దుంది.

జానకి : (వెక్కిరింపుగా) పంచదార డబ్బా చెక్కమీదుందీ. కాఫీ పెత్తు... (ఒక్కమూలుగు మూలిగి) ఇన్నేళ్లొచ్చాయి ఒక్కసంగతీ తెలియదు.

సత్యం : (పొడిదగ్గుదగ్గుతాడు) బాగున్నావా జానకీ ?

జానకి : (మాట్లాడదు)

సత్యం : నిన్నే జానకి !

జానకి : (పలకదు)

సత్యం : నిన్ను చూస్తుంటే నాకో ఇంగ్లీషు సామెత గుర్తొస్తోంది. హాఫ్‌క్లోజ్డ్ డోర్ ఈజ్ హాఫ్ ఓపెన్ డోర్, అంటూ డొంకాయన.

జానకి : నాకంత ఇంగ్లీషు రాదు.

సత్యం : మరేంలేదు. ఒకరెక్క మూసిఉన్న తలుపు, వేస్తున్నట్లా, తీస్తున్నట్లా అని ?

జానకి : (మళ్ళా మౌనం)

సత్యం : నేనిక్కడుండడం, నీకంత ఇష్టంలేకపోతే వెళ్ళిపోతాను.

జానకి : నన్నడిగి మీరిక్కడికి రాలేదు.

సత్యం : నా అంతట నేట ౹తట—ను...నిన్ను చూడకుండా ఉండలేక పోయాను..—ను....ంత్నించినా నన్ను నేను నిగ్రహించుకో లేక పో లేక పొ

జానకి : ఇలాంటిమాటలటటతనక ంలనకండి.

సత్యం : ఒకప్పుడు, పిరికిమాటన్న న్ను పోగొట్టుకొన్నాను. ఈ సారి ఆ పని చెయ్యం చెష్టం లేష్టం లేదు జానకీ!

జానికి : అంటే ? అమ్మ

సత్యం : అంటేనా ? అంసి చెప్పనం చెప్పను జానకీ ?

జానకి : మీ అమ్మ మళ్లీ దూరం దూకుతానంటుందేమో ?

సత్యం : అప్పుడు తల్లి అమ టాటువాటువాణ్ని. వాళ్ళమాట కాదనలేక పోయాన ధ లేంభీర గంభీరంగా) — నా కిప్పు డలాంటి బాధలేమి లేచు నంగ! నెలకు వెయ్యి రూపా యల జీతం తెచ్చుకోయాటిఉంది. కంపెనీవారే, కారొకటి ఇచ్చారు. లంకంతచేమి కం ఉంది. ఇంటినిండా నౌక ర్లున్నారు. ఇంటిమ్చుట్టూ ఉంర్న గార్డెన్ ఉంది. నన్ను అడిగేవాళ్లూ, అదకంట్లా దాళ్లూ లేరు. నువ్వు ఊఁ అంటే నా జన్మ తరిఓపేవ ఇలేదా, ఇలా ఆ జన్మ బ్రహ్మ చారిగానే ఉండి పో ఉండి

జానకి : నాయిష్టం ఏమైటం స్రిను అమ్మను కనుక్కో—వాలి.

సత్యం : అత్తయ్యను చెప్పి ని నే బాధ్యత నాది. ముందు నీ అభిప్రాయ మేమిటొ మేమి చానకీ!

జానకి : అమ్మ చెప్పిన మ్మ నానే నే నింతవరకు కాదనలేదు.

సత్యం : (ఆవేశంగా) ఆమోలా చాలా అదృష్టవంతుణ్ని జానకీ. ఇవ్వాళ నేళన్వళగాలా చాలా మంచిది.

జానకి : (నవ్వుతూ) ఉన్న సంతోషమంతా యిప్పుడే ఖర్చు పెట్టకండి.

సత్యం : ఎంత అద్భుతంగా నవ్వుతావు జానకీ! ఈ నవ్వు కోసమే నేను పడి చచ్చేవాణ్ని. ఏదీ, ఇంకోసారి...మరో సారి...చిన్న నవ్వు. అలా – అలా నవ్వు జానకీ!

జానకి : (ముద్దులు గుడుస్తూ) ఊఁ పో సత్యం ఏమిటమ్మా ఆ మాటలు?

సత్యం : బుంగమూతి పెడితే, ఎంత అందంగా ఉంటావు జానకీ!

జానకి : ఇశ్శో. ఉండండి...చెయ్యి వదలండి అవతలెవరో వస్తున్నారు.

సత్యం : ఛీఛీ, వాళ్ళు యిప్పుడే రావాలీ, సినిమాలో విలన్ లాగా.

జానకి : నిజంగా ఇదే మనం సినిమాల్లో చూసి, చాలా అసహజంగా ఉందంటాంకదూ?

సత్యం : ఏది?

జానకి : ఇలా మనిద్దరం కలవడం.

సత్యం : తలవని తలంపుగా జరిగింది జానకీ........ఇన్నిటికి నువ్వొస్తున్నారన్న వాళ్లేరీ!

జానకి : (పకపకా నవ్వుతుంది.)

సత్యం : అమ్మ దొంగా ఎంత నాటకమాడావ్?

జానకి : అడ్డం లేవండి. కాఫీ పెట్టొస్తాను.

సత్యం : పద. నేనూ నీకు సాయం చేస్తాను.

జానకి : లాలలలా, లాలలాలః లలలా.
లాలాలాలలా, లాలఃలా.
(ముక్కుతో అదేపనిగా అల ఆరిగగా, టెలిఫోన్ మోగుతుంది.)
విరిసిందోయ్ వాందిప పందిరి
వెలిసిందోయ్ —దోదిఒ సుందరి
(మళ్ళీ టెల్ఫ్ మోగుతుంది.)
లా లలలా, లా, లులా, లలలా,
లాలాలాల, లా, లల, లలా,
(ముక్కుతో ి ండుండగా ఫోన్)
జానకి : (విసుగ్గా) అబ్బబ్బబ్బబ్బో. ఒక్క క్షణం కులాసాగా ఉండనీరు. ప్రాణాలు ని · ను తోడేస్తున్నారు. (ఫోన్ ఎత్తిన చప్పుడు) హల్లో లు డాన్. జానకి స్పీకింగ్ ... అవునయ్యా బాబూ నేనూ ాట్లాడుతున్నాను ... ఇప్పుడు వీల్లేదు. ఎక్స్క్యూజ్ మీ ఃచెప్పాచెప్పలేనండి ... మీ ఇష్టం. పోనీ రేపోసారి ఫోన్ చేనిపిండి ... ఆల్ రైట్ (ఫోన్ పెట్టేసిన ధ్వని) సినిమవివాకేరంటే వల్లమాలిన మోజు. వీడి కెవడికో నా ఫోటోజః, వాలిట, ఫోటో. (కోపంగా) నారాయణా!! (జవాబవా అ ఆగి అదిరాని కారణంగా, మరింత బిగ్గరగా) నారాశార !!!
నారా : (దూరంగా) అవ నా!! (క్రమంగా దగ్గరికొస్తూ) వస్తున్నానమ్మా! (వః (ఽమ్మా !!
జానకి : పలక వేంరా?
నారా : అక్క డెవరో వ ీ ఆరితో మాట్లాడుతున్నానమ్మా!
జానకి : ఎవరుట ఆ వచ్చించ్చి

నారా : ఒకాయన, అదేందో, పేపరంటమ్మా, దానితాలూకు మనిషి. ఆ రెండో ఆయన్ది బెజవా డంటమ్మా!

జానకి : ఎందుకొచ్చారట?

నారా : తెలియదండమ్మా!

జానకి : (కోపంగా) వెధవ, మరినువ్వుండి చేస్తున్న దేమిట్రా?

నారా : మీరెటుగూడి కనుక్కోమంటారుగదాని, నే నడగ లేదమ్మా.

జానకి : సెక్రటరీ రాలేదు గదూ?

నారా : లేదమ్మా ఈ పూట రానని చెప్పారు.

జానకి : అంతా దొరికారు పాడుసజ్జు ... సరే, వాళ్ళనిలా రమ్మను.

నారా : ఇద్దర్నీ ఒకేసారి పంపియ్యమంటారా అమ్మా?

జానకి : ఇడియట్. ఆ మాత్రం తెలీదూ. ముందా బెజవాడ వాణ్ని రమ్మను ...

నారా : అలాగే నమ్మా!

జానకి : ఈ వచ్చిపోయేవాళ్ళతో, నాళూ, నరాలూ తెగు తున్నాయి...వీ డెంతసేపు వేధిస్తాడో యేమిటో ఖర్మం.

అతను : (వస్తూ) నమస్కారమండీ!

జానకి : నమస్తే కూచోండి.

అతను : మాది బెజవాడండీ.

జానకి : ఒహో!

అతను : ఈ మధ్యనే మేమో అనాధ శరణాలయం ప్రారంభించాం. ఇప్పటికి వందమంది పిల్లలుదాకా శరణా లయంలో ఉన్నారు. వారందరికీ, తిండీ, గుడ్డా ఇవ్వడం శరణాలయానికి మించిన పనయిందండీ! అందుకని, మీ

లాంటి వారిని దర్శిం దరాయర సాయం పొందుదామని వచ్చానండీ!

జానకి : మీా ఆశయం చాం! గా ఛ్గా ఉంది!

అతను : చిత్తం.

జానకి : ప్రస్తుతం నేనేమియుం నేను, చెయ్యలేను, మరొకసారి కనిపించండి.

అతను : మళ్ళీ ఇంతదూరిటూ ౼ంంటే —

జానకి : మీా అద్రసిచ్చి గ్గాంయునులునుబట్టి చూస్తాను.

అతను : మీాలాంటి గొఃసిచ్చిద్దిల్లా లా అంటే —

జానకి : నారాయణా!..పించు

నారా : (వస్తూ) అమ్మా అః!.

జానకి : వీరిని పంపించు. అమన్ని రతన్ని రమ్మను.

నారా : చిత్తం రా బాబా వి

జానకి : (క్షణం విరావగా అనాడి) అనాథ శరణాలయం పెట్టాట. చేతగాని వెతగానిట్టూకగానట్టూరుకోకుండా ... (ఉత్సాహంగా) నమ ం) డీ, ర రండి, రండి.

జగన్నాథ్ : నమస్తే, నమస్తే,

జానకి : మీా పత్రిక పేరేలా పేంలా?

జగ : 'బాజాబజంత్రీ' అంంత్రీ' టేమి టలా అడుగుతున్నారు? మీాకు పత్రికెలా కాపీలా కు చన్నా నే!

జానకి : చాలా పత్రిక లత్రిక ఃకు ఃకుండీ!

జగ : అవునవును ... వత్రిక మాకు చూసే తీరుబాటు ఉండొద్దూ మరి!

జానకి : బొత్తిగా రెస్టులేదు సార్. 'నా వల్ల కాదోయ్ బాబూ' అంటున్నా, ఈ ప్రొడ్యూసరు వినడం లేదు ... ఇన్నిటికీ మీరు రెందుకొచ్చినట్లో చెప్పారు గాదు.
జగ : ఈ సంచికలో మీ జీవిత చరిత్రను, సచిత్రంగా వేస్తామని లోగడ ప్రకటించామండి.
జానకి : ఓహో!
జగ : అందుకోసం వచ్చానండి.
జానకి : రేపు సెక్రటరీని కలుసుకోండి. అన్ని వివరాలు దొరుకుతాయి...

(గణగణమని ఫోన్ మోగుతుంది. జానకి ఫోన్ అందుకొంటుంది.)

జానకి : హాలో .... యస్ ... అవునండీ ఎవరండీ మాట్లాడేది? ... (చాలా అణకువగా) నమస్తే సార్ ... ఎందుకండీ? ... అయ్యో ... మీరు రావడ మేమిటండీ ... అహ .... అందుక్కాదు ... కబురు చేస్తే నేనే వచ్చేదాన్నిగా...థాంక్స్...ఇప్పుడేనా? సరే రండి...అబ్బే, నే నింట్లోనే ఉంటాను...సరే సరే, నమస్కారం.

(ఫోన్ పెట్టేస్తుంది.)

జానకి : నారాయణా!
నారా : (వస్తూ) అమ్మా!
జానకి : మోహన్‌గా రొస్తున్నారు, నాయర్‌ని టిఫెన్ చెయ్యమని చెప్పు.
నారా : అలాగేనండమ్మా!
జానకి : ఆ, ఏమిటండీ మీరంటోంది?
జగ : మీ ఫోటోలు కావాలండి.
జానకి : సెక్రటరీని అడగమన్నానుగాదూ?

జగ : పాతవికాదండి, మీ లేటెస్ట్ ఫొటోలు కావాలండీ!

జానకి : తరువాత చూస్తా.

జగ : మరి—మా పాఠకుల ప్రశ్నలకు మీరు జవాబులివ్వాలండి.

జానకి : క్షమించండి సార్! నాకు బొత్తిగా తీరిక లేదు. పోనీ, మీరే రాసి పట్టుకురండి. సంతకం పెడతాను.

జగ : మీ అభిరుచు లేమిటో తెలుసుకోవాలని, పాఠక ప్రపంచం ఉవ్విళ్లూరుతున్నదండీ!

జానకి : నాకు ప్రత్యేకంగా అభిరుచు లేమీ లేవు సార్!

జగ : ఇలాగని రాస్తే, ఎవ్వరూ నమ్మరండీ!

జానకి : ఏదో మీ యిష్టం వచ్చినవి రాయండి. నేను కాదనను.

(దూరంనుండి కారు వచ్చి ఆగిన చప్పుడయింది)

నారా : అమ్మా!, మోడి బాబుగారొచ్చారు.

జానకి : (తొందర తొందరగా) నారాయణా, ఈ కుర్చీలు, బల్లలూ సర్దు. ఆ ఫ్లవర్ వేజు ఇక్కడపెట్టు. టామీని, నా దగ్గరకు తీసుకురా. నాయర్ టిఫిన్ చేశాడా?... సార్ కాజా భజం(?) లేమైనా, మరి సెలవు...మనం ఇంకో సారి కలుసుకొందాం. నమస్తే...మరి వెళ్ళిరండి.

జగ : మీ త్రివర్ణ ముఖచిత్రం....

జానకి : అన్నిటికీ సెక్రటరీని చూడవయ్యా బాబూ! చెబుతుంటే వినిపించుకోవే....

జగ : సెలవిప్పించండి...

జానకి : రైటో.

(కొద్ది! గామం తర్వాత)

జానకి : నమస్తే మోహనఫీ!

మోహ : నమస్తే, నమహా.

జానకి : మీకు చాలా [illegible]ం యిచ్చాను.

మోహ : నెవర్ మైండ్.
జానకి : నారాయణా!
నారా : అమ్మా!
జానకి : నాయర్‌ని టిఫెనూ, కాఫీ పట్టుకురమ్మను.
మోహ : అమ్మమ్మమ్మా, నన్ను చంపకండి. నే నిప్పుడే తీసుకొస్తున్నాను.
జానకి : పోనీ కూల్ డ్రింకు తీసుకోండి.
మోహ : థాంక్స్! అక్కర్లేదు.
జానకి : మొఖమాట పడుతున్నారా?
మోహ : మనం కొత్తవాళ్ళం కాదుగదా?
జానకి : (పెద్దగా నవ్వుతుంది.)
మోహ : మీ కేసంగతి నిర్మొహమాటంగా చెప్పండి.
జానకి : దేన్ని గురించి?
మోహ : నేను కొత్తగా పిక్చర్ తియ్యబోతున్నాను. పేపర్ వర్కంతా పూర్తయింది. మూడు భాషల్లో ఒకేసారి తియ్యడానికి అన్నీ పూర్తయ్యాయి. మిమ్మల్ని హీరోయిన్‌గా బుక్ చేదామనుకుంటున్నాను.
జానకి : థాంక్స్.
మోహ : మీ కెంతకావాలో అడగండి. నచ్చితే ఇదిగో అడ్వాన్సు, ఇదిగో కంట్రాక్టు.
జానకి : నేనిప్పుడెంత తీసుకొంటున్నదీ మీకు తెలుసు. ఇప్పటికే నాకు ఊపిరాడకుండా ఉంది.
మోహ : లక్షరూపాయ లిద్దామనుకొన్నాను. మరో పాతిక వేలు మీ పబ్లిసిటీ క్రింద ఖర్చుపెడతాను.
జానకి : మీమాట తీసెయ్యలేను.

మోహ : కాంట్రాక్టుమీద తంతకంచేసి రేపు పంపండి.

జానకి : నారాయణా!

నారా : అమ్మా వస్తున్నా.

జానకి : మోహన్‌గారు పోతున్నారు. మన కారుమీద వారిని తీసికెళ్ళమని డ్రైవర్‌తో చెప్పు.

మోహ : నోనో... నే కారు తోటే వచ్చాను.

జానకి : ఫర్వాలేదు లెండి.

మోహ : ఎందుకండీ అనవసర శ్రమ...మరి నేను వెళ్ళనా?

జానకి : అచ్ఛా, నేనుంటాటు మోహన్‌గారూ!

మోహ : (దూరంగా) ఓ.....ఉండండి.

సుంద : (ముమ్మరంగా దగ్గుతూ) (బిగ్గరగా) విన్నావే పశువా! (మళ్ళా ఉద్వేత్తుగా దగ్గుతుంది.) ఇదీవరస...పిలిచీపిలిచీ నా నోరు నొప్పెత్తడమేగాని ... (బిగ్గరగా దగ్గుతాడు) అమ్మయ్యా, ప్రాణాలు కడకట్టి పోతున్నాయి...జానకీ!!

జానకి : (ఉలిక్కిపడినట్లు) ఆ.... ఏమిటండీ అయ్యో, ఎక్కడికిలా లేచి వెడుతున్నారు?

సుంద : (కసిగా) చావడానికి. వదులు, నన్ను పట్టుకోకు....

జానకి : డాక్టర్ మంచంలోంచి కదలొద్దన్నాడు మీరేమో... ఇప్పటిదాకా మేలుకొనిఉన్నానండి.

సుంద : బ్రతకాలనుకొన్నవాడికి డాక్టరుకాని, నాకెందుకు జానకీ. (దగ్గు ఈ దగ్గు నయంకాదు. ఈ బాధలు నేను పడలేను. ఎప్పుడో ఇలాగనే నెత్తురు కక్కుకొని...(గొంతు పూడిపోతుంది.)

జానకి : (రుద్ధకంఠంతో) ఊరుకుతప్ప నాకుమాత్ర మెవరున్నారండి. పదండి...మీతోపాటే నేనూ వస్తాను.

# జారే కాళ్లు

**పాత్రలు :**

భాస్కరం శేషాద్రి సుమతి
గోపాలం దేవయ్య

సుమతి : (తలుపు కొడుతూ–) భాస్కరం, భాస్కరం. (బిగ్గరగా–) నిన్నేనోయ్ భాస్కరం !

భాస్కరం : (లోనుండి) ఎవరు?

సుమ : నేను భాస్కరం !

భా : నాకు వొంట్లో బావుండలేదండీ. మీ అద్దె రేపు చెల్లిస్తాను. దయచేసి నన్ను డిస్టర్బ్ చెయ్యకండి.

సు : అదేమిటి భాస్కరం? నేను సుమతినోయ్. (తలుపుతట్టి) తలుపు తియ్యరాదూ?

భా : సారీ వస్తున్నాను. (తలుపుతీశాక) క్షమించు సుమతీ. నువ్వనుకోలేదు.

సు : అలా ఉన్నావేం భాస్కరం, వొంట్లో బావోలేదా?

భా : బాగానే ఉన్నానే.

సు : అని నువ్వన్నా నేనెలా నమ్మనోయ్. లంఖణాల మనిషిలా ఉన్నావ్. భోజనం చేయడంలేదా ఏం?

భా : చేస్తూనే ఉన్నాను.

సు : అయినా మామూలుగా లేవు. అది సర్లేగాని భాస్కరం. ఈ రెండురోజులూ కనిపించావుకాదేం?

భా : ఆమాటే నిన్నూ అడగాలనుకొన్నాను.

సు : నువ్వొస్తావని కూర్చున్నాను గాని, లేకపోతే నేనే వచ్చేద్దును.

భా : నేను చాలా మందమతిని సుమతీ.

సు : ఎవరన్నారు?

భా : నాకు తెలుసు, ఇంటికొచ్చినవారికి మర్యాద చేయడం కూడా తెలీదు.

సు : చాలా కొత్తగా మాట్లాడుతున్నావే భాస్కరం.

భా : ఏంలేదమ్మడూ, నేనేదో లంఖణాలు చేసినవాడిలా ఉన్నానని పరామర్శచేశావుగాని, నీసంగతి చెప్పావుగాదు.

సు : ఏమన్నా ఉండాలిగదా?

భా : ఏమీలేందే — అలా జ్వరంపడ్డ దానిలా ఉంటావా సుమతీ నువ్వు. ఏదో కారణం ఉండే ఉంటుంది. అవునా?

సు : ప్రతిదానికీ ఓ కారణమంటూ ఉంటుంది భాస్కరం. కొన్ని కారణాలు చప్పున అవగాహనౌతాయి. కొన్ని చాలా దూరంగా ఉంటాయి.

భా : ఇదేరకమో చెబితే.

సు : మరేంలేదోయ్. మా నాన్న జాబు రాశాడు.

భా : చదువు మానుకోమనేనా?

సు : నీ కెలా తెలుసు?

భా : తెలిసిగాదు — బహుశా ఇది కావచ్చునని నా కెందుకో అనిపించిందిలే.

సు : అవును భాస్కరం.

భా : ఎందుకనో చెప్పావుగాదు.

సు : నా నోటిమీదుగా చెప్పించాలని కాకపోతే, ఆమాత్రం నువ్వీపాటికి ఆలోచించే ఉంటావు భాస్కరం. నిజంగదూ?

భా : నిజమేగాని, నా ఊహ ఎంతవరకు సత్యమో, రూఢి చేసుకుందామని. ఈ మధ్య నే ననుకొన్నవన్నీ ఎదురు తిరుగుతున్నాయి. బ్రతుక్కూ, భావనకూ ఎక్కడా లంగ రందడం లేదు సుమతీ.

సు : సరిగ్గా నే ననవలసిన మాటలే నువ్వూ అన్నావోయ్. అదే విచిత్రంగా ఉంది.

భా : అంటే — ఇద్దరం ఒకే పడవలో ప్రయాణం చేస్తున్నా మన్న మాట.

సు : ఏం ప్రయాణమో, ఏం బ్రతుకో అర్థం కాకుండా ఉంది భాస్కరం. అడుగడుగునా అంతరాయాలే తగులుతున్నాయి. ప్రతిక్షణం జీవితం సుడిగుండాల్లో చిక్కుకుని అల్లల్లాడి పోతునే ఉంది. ఆలోచనకూ, ఆచరణకూ మధ్య, రోజు రోజుకూ అగాధం పెరిగి పోతూ ఉంది......వింటున్నావా భాస్కరం?

భా : ఏమంటున్నావ్ ?

సు : ఏమిటోయ్ ఆ ఆలోచన ? నాతో చెప్పరాదా ?

భా : ఎప్పటికప్పటికి, తప్పకుండా నీకు తెలియజెయ్యవలసిన విషయమే సుమీ. కానీ, ఆ విధానం మాత్రం నాకు అంతు పట్టడం లేదు.

సు : ఈ రెండు రోజులూ ఈ విధానం గురించే ఆలోచిస్తు న్నావా?

భా : మరే.

సు : దొరక లేదనుకుంటాను.

భా : లేదు.

సు : (నిట్టూర్చి) నేను ఫక్తు నీ దశలోనే ఉన్నాను (క్షణం ఆగి) భాస్కరం!

భా : ఏమిటమ్మడూ?

సు : ఇంకా నన్నలా పిలువకు భాస్కరం.

భా : ఏం?

సు : మన మిూ గొంగళిపురుగు తొడుగును వదిలేసి అసలైన సీతాకోకచిలకలం అవుదాం. చెప్పేసెయ్యి భాస్కరం.

భా : చెప్పడాని కేమున్నదమ్మడూ? మా నాన్న నన్నమ్ము తానని మాటిచ్చేశాడుట. బయానా కూడా పుచ్చుకొన్నాట్ట.

సు : ఎన్ని వేలకు అమ్ముడు బోతున్నావ్ భాస్కరం?

భా : ఆ వివరా లేమీ రాయలేదు. యం. ఎ. చదువుతున్న వాణ్ని గదా. అధమం ఇరవై వే లుండకపోవు. ఇవిగాక మామూలుగా పిండుకొనే వరస ఉండనే ఉంటుంది.

సు : నువ్వేమన్నావయ్యా?

భా : ఏమన మంటావ్ సుమతి?

సు : ఒకప్పుడైతే నేనూ తగిన సలహాలిచ్చేదాన్ని. ఇప్పుడు నాకూ ఆ స్వాతంత్ర్యం లేదు భాస్కరం.

భా : అంటే?

సు : మన మిప్పుడు గొంగళిపురుగులం కాదు — సీతాకోకచిలకలం. కొద్దిసేపట్లో ఒకరి నుండి మరొకరం శాశ్వతంగా సెలవు పుచ్చుకో బోతున్నాం. ఈ దశలో అవసరమైన మర్యాదలకు పోయి కాలం దుర్వ్యయం చేసుకోవడం భావ్యం కాదు. అవునా భాస్కరం?

భా : నా కేమీ పాలుబోవడం లేదు సుమతీ, మనస్సు అల్ల కల్లోలంగా ఉంది.

సు : పిచ్చితండ్రి అన్నీ సర్దుకుంటాయిలే, కావలసిందల్లా వ్యవధానం. మన కెవ్వరికీ లేని గొప్ప శక్తిని భగవంతుడు కాలానికి ఇచ్చాడు. మనం గాయాలను రేపుకొన్నా కాలం మాన్పుతుందిలే.

భా : ఇంత వైరాగ్యం ఎలా అబ్బించుకొన్నావమ్మడూ ?

సు : కావాలనా ఇదంతా తెచ్చుకొంది ? కాదు – అవసర మయింది గనక. ఇంతకన్నా ఎవరుమాత్రం ఏం చెయ్య గలరు చెప్పు భాస్కరం ? (నవ్వు)

భా : ఈ డబ్బు ఎంత పాపిష్ఠిది సుమతీ! నామీద పెట్టిన పెట్టుబడికి, చక్ర వడ్డీతోసహా మా నాన్న వసూలు చేయాలనుకుంటున్నాడు. ఈ డబ్బే లేకపోయినట్లయితే– ఎందు కమ్మడూ ? అలా నవ్వుతావ్ ?

సు : డబ్బు దేముందోయ్ పిచ్చివాడా ? ఉన్నదంతా మన లోనే ఉంది. నా యజమాని ఖరీదు చెప్పనా ?

భా : లేదనుకుంటాను.

సు : నిజంగానే లేదు. ఖచ్చితంగా నాకే తెలీదు. (నవ్వి) చాలా చిత్రంగా ఉందిగదూ భాస్కరం ? ఎంతో కొంత డబ్బిచ్చి నేనే మొగుణ్ని కొనుక్కొంటున్నాను. ఆయ నెవరో తెలీదు. ఆయనకు నేను నచ్చుతానో లేదో అంతకన్నా తెలీదు. నాతో సంప్రదింపులంటూ లేకుం డానే, నా బ్రతుకును నిర్ణయించేస్తున్నారు. ఇష్టమున్నా లేకపోయినా నా బ్రతుకంతా, అలానే గడిచిపోవాలి.

(చివరి మాటలు ఏడుపులో కలిసిపోతాయి)

భా : నే నెవరితో చెప్పుకోను అమ్మడూ? నేనుమాత్రం సుఖంగా ఉంటున్నానా! అంత డబ్బుకు అమ్ముడు పోయిన వాణ్ని, ఆమెతో మనసిచ్చి మాట్లాడగలనా! ఆమెను చూసినప్పుడల్లా నా బానిసతనం, నన్ను రాచి రంపాన పెట్టదా? ఇందుకు నా కొక్కటే ఉపాయం తోస్తున్నది. నువ్వు గూడా అంగీకరిస్తే?

సు : నా వొప్పుదం తీసుకోని కాని చెప్పవా భాస్కరం?

భా : మరేం లేదు...మన మిద్దరం...

సు : (బిగ్గరగా) వొద్దు వొద్దు. చెప్పకు నాకు తెలుసు.

భా : అంతకన్నా మరో పరిష్కారం తోచడంలేదు అమ్మడూ.

సు : ఇంకేదన్నా చెబుతావేమోనని నీ దగ్గర కొచ్చాను. ఇంతకుమించి, మరోమార్గమంటూ లేకపోతే, మనమీ దోవనే వెళదాం. పిరికిపడి పారిపోయి, బ్రతుకులో బావు కొనేదేమీ ఉండదనుకొంటాను భాస్కరం. ధైర్యవంతుల్నే జీవితం మెచ్చుకొంటుంది. సరే నేను వెడతాను...

భా : అప్పుడే!

సు : ఎప్పటికయినా వెళ్ళవలసిన ప్రయాణానికి ఇప్పుడే వెడితే మాత్రం తప్పేమిటి?

భా : మళ్ళీ కలుసుకోమనుకొంటాను.

సు : దానికి సమాధానం చెప్పవలసింది నువ్వు. కానీ, ఓ పిరికి వాణ్ని ప్రేమించానన్న వ్యథ మాత్రం కలకాలం నా గుండెల్ని తొలుస్తూనే ఉంటుంది. అందుకే నేను బాధ పడుతున్నాను.

భా : సుమిత్రా, సుమిత్రా, సుమీ. ఒక్కమాట. (క్షణం ఆగి) వెళ్ళిపోయింది...మళ్ళీ కలుసుకోం. మళ్ళీ చూసు

కోం, ఇదే ఆఖరు... ఇదే ఆఖరు, (ఆగి) కాదు. ఎదురు తిరుగుతాను, తిరగబడతాను. అడ్డు వచ్చిన సమస్తాన్నీ నాశనం చేస్తాను. ప్రళయకాల రుద్రునిలా ధ్వంసంచేస్తాను.

(జంత్ర వాద్యాల ధ్వని వరదలా ముంచుకొచ్చి, విషాదంగా ఆగిపోతుంది.)

* * *

శేషాద్రి : ఏమోయ్, వాణ్నిలా రమ్మని చెప్పు.

భా : వస్తున్నాను నాన్నా.

శే : అలా ఉన్నావేంరా ? బండిలో చోటు దొరకలేదా ?

భా : దొరికింది.

శే : పరీక్షలు ముందు పెట్టుకొని వచ్చావేం ? నే రాసిన ఉత్తరం అందిందా ?

భా : ఆc...

శే : జవాబు రాస్తే పోయేదానికి ....

భా : మాట్లాడుదామని వచ్చాను.

శే : ఏమిట్రా నీకీ పెళ్లి ఇష్టంలేదా ?

భా : తెలిసిగూడా ననెన్నందు కిలా అడుగుతావు నాన్నా ?

శే : ఎందుకో వివరంగా తెలుసుకొందామని.

భా : ఆ కారణాలన్నీ నేను చెప్పబోవడం లేదు. నా కిష్టం లేదన్నాను, అంతే.

శే : మానుకోమంటావా ?

భా : తరువాత మీ ఇష్టం.

శే : నా ఇష్టం పనికి రాదన్నావుగా, మళ్ళీ నా నిర్ణయానికే వదులుతావేం ?

భా : నా అనుమతిలేకుండా ఇలా చేయడం భావ్యమేనా నాన్నా?

శే : నీకు చేసినవన్నీ నీ అనుమతిపొంది ఎప్పుడూ చేయ లేదు. నీ అనుజ్ఞ తీసుకొనే నిన్ను చదివించా[న్రా]? నీ అనుజ్ఞ తీసుకొనే నాలుగెకరాల పొలమూ నీచదువుకోసం అమ్మా[న్రా]? లేదే, అప్పుడెప్పుడూ అవసరంకాని నీ అనుమతి, ఈ విషయంలో అవసరమవుతుందని నేనూ అనుకోలేదు.

భా : నామీద వ్యాపారం చేదామనుకొంటున్నావా నాన్నా?

శే : నాయనా! జీవితమే వ్యాపారంలాంటి దయినప్పుడు, దాన్నుండి—నువ్వూ, నేనూ తప్పుకోలేం. నీకు మేలు చెయ్యాలనే నా తాపత్రయంగానీ, ఈ పెళ్ళివల్ల నీవింత కష్టపడతావనుకోలేదు. బంగారంలాంటి పిల్ల, బోలెడంత కట్నం....పైగా బాగా చదువుకొందిట. నీకు తెలిసే ఉంటుందనుకొన్నాను.

భా : ఎవరు నాన్నా?

శే : ఏదో పేరు చెప్పాడు.

భా : సుమతి కాదుగదా.

శే : అలాంటిపేరే చెప్పిన జ్ఞాపకం.

భా : తప్పకుండా—తప్పకుండా చేసుకొంటా నాన్నా. వెంటనే లగ్నాలు పెట్టించండి.

శే : అదేమిట్రా. ఇంతప్పణ్నించీ నీధోరణే ఇలా ఉంటోంది. ప్రతిదానికి తొందరే. ఏదీ స్థిమితంగా ఆలోచించలేవు.... ఏమోయ్. తొమ్మిది దాటిందేమో చూడు. నేనటు కేసి వెళ్ళొస్తాను.

(దూరంగా అడుగులచప్పుడు క్రమంగా దగ్గరకొచ్చి ఆగుతుంది.)

గోపాలం: ఏమిటి దేవయ్యా! ఎందుకిలా తోటలోకి తీసుకొచ్చావ్?

దే : అమ్మాయి పెళ్ళివిషయం మాట్లాడదామని.

గో : ఇప్పుడు మాట్లాడవలసిందేమీ లేదు. తాంబూలాలు పుచ్చుకొన్నాం, లగ్నాలు పెట్టుకొన్నాం.

దే : అమ్మాయికి ఇష్టంలేదు గోపాలంగారూ?

గో: చిన్నవాళ్ళ ఇష్టాలన్నీ పాటిస్తూ కూచుంటే పనులుకావు దేవయ్యా. అయినా ఈ స్థితిలో నేను చెయ్యగలిగిందేమీ లేదు. పందిళ్ళు వేయించాను. శుభలేఖలు పంపించాను.

దే : ఆగిపోయినట్లు వ్రాయించండి.

గో : హరిబ్రహ్మాదు లొచ్చినా ఆపను.

దే : (బిగ్గరగా) ఆగుతుంది. (శాంతంగా) ఆలోచించండి గోపాలంగారూ. సుమతి కంటికీ మంటికి ఏకధారగా ఏడుస్తుంటే — కన్నకడుపు తరుక్కు పోతూ ఉంది గోపాలం గారూ!

గో : దేవయ్యా! హద్దు మీరుతున్నావు. నువ్వు తోటమాలివి. తోటమాలిలాగే మాట్లాడు.

దే : అసలు విషయం మీకు తెలియదా? భగవంతుడికి తెలియదా గోపాలంగారూ?

గో : తెలియదు. సుమతి నీ కూతురని, చస్తే రుజువు చేసుకోలేవు. సుమతి గూడా నమ్మదు.

దే : నే నమ్మిస్తాను.

గో : అసంభవం. ఏడాది కసుగందును తెచ్చుకొన్నాను. పెంచేను, పెద్ద చేశాను. లోకమంతా సుమతి నా కూతురనే అంటుంది.

దే : కాని భగవంతుని కళ్ళు కప్పగలరా ?

గో : అన్నమాటమీద నిలబడాలి గాని, నీ కీ ప్రశ్నలన్నీ ఎందుకు దేవయ్యా ? బిడ్డకు దగ్గరగా ఉంటానన్నావు కదాని వొప్పుకున్నాను గాని, లేకపోతే—

దే : ఇంతేనంటారా గోపాలంగారూ?

గో : ఇంతే.

దే : (భావురుమని ఏడుస్తాడు) నా బిడ్డల సుఖం చూచుకొనే యోగ్యత నాకు లేదా గోపాలంగారూ ? అయిదేళ్ళ కొడు కేమయ్యాడో ఇప్పటికీ తెలీదు. తెలిసిన కూతురు బ్రతు కేమో యిలా నిప్పులా మండుతోంది......భగవంతుడు నా కిలాంటి రాత నెందుకు రాయాలి గోపాలంగారూ ? నే చేసిన పాపమేమిటి ? నేనేం పాపం చేశానని గోపాలం గారూ! ఏ పాపం చేశాను ?

గో : ఊరుకో దేవయ్యా! ఈ పెళ్ళి హడావిడి కాగానే, నీ కొడుకును వెతికిస్తాను. ఊరుకో. సుమతొస్తోంది. కళ్లు తుడుచుకో...నే పోతున్నా...ఈ సంగతు లేమీ అనకు.

సు : దేవయ్యా !

దే : ఏమిటి తల్లీ !

సు:నాన్న చాలామంచివాడు దేవయ్యా! ఆయనఏంచేసినా నా మంచికోసమేచేస్తాడు. నాన్నకోసం ఏదో నేనేసర్దుకుంటాను.

దే : ఏమిటమ్మా ?

సు : భాస్కరంతోనట దేవయ్యా నా పెళ్ళి !

దేవ : అలాగామ్మా. భగవంతుడు చాలా మంచివాడు తల్లీ. ఉత్తముల్ని కష్టపెట్టడు. ఇంకేం ? కావాలనుకున్న మనిషే దొరికాడుగా. ఒక్కసారి నవ్వమ్మా.

సుమ : (ఫకాలుమని నవ్వుతుంది)

దేవ : నా బంగారు తల్లివమ్మా నువ్వు!

(పెళ్ళిమేళం మంత్రాలు గగ్గోలుగా వినిపిస్తుంటాయి.)

ఓ కంఠం : అయ్యా లగ్నం దగ్గర కొచ్చింది. పెళ్ళికూతుర్ని తీసుకురండి.

గోపా : దేవయ్యా! అమ్మగారితో చెప్పి, అమ్మాయిని పంపించమను.

దేవ: నమస్కారం భాస్కరంబాబుగారూ! ఏదీ,ఇలాచూడండి.

గోపా : నువ్వెళ్ళు దేవయ్యా.

దేవ : (రుద్ధకంఠంతో) నీకుడిచెయ్యి చాపు నాయనా భాస్కరం. వీపు చూడనివ్వు. (అరే అరే పుట్టుమచ్చే.)

ఓ కంఠం : అయ్యా! ఆలస్యంలేదు.

దేవ : ఆగండి, ఆగండి.

గోపా : నీకు పిచ్చెక్కిందా దేవయ్యా? అరేయ్ వీణ్ని తీసుకెళ్ళి కొట్టంలో పడేయండ్రా.

(గగ్గోలుగా కేకలు)

దేవ : బాబూ! ఆగండి, ఆగండి. పెళ్ళి చేయకండి ...

(అని అరుస్తూ దూరంగా వెడతాడు)

గోపా : వాడికి అప్పుడప్పుడు మతి చలిస్తూ ఉంటుంది లెండి. కానివ్వండీ పురోహితుడుగారూ!

ఓ కంఠం : నాయనా, ఈ మంగళసూత్రం తీసుకొని...

(ఢభీమని ధ్వని, గగ్గోలుగా కేకలు)

(వినిపించుతుండగానే) దేవయ్య బావిలో పడ్డాడు అని ఓకంఠం అరుస్తుంది.

1వ వాడు : ఎందుకని?

2వ వాడు : కాళ్ళు జారుంటాయి పాపం.

# ఎదురుగాలి

పాత్రలు:

చలమయ్య — రాజమ్మ
ప్రకాశం — సుభద్ర
కృష్ణమూర్తి — రాజ్యం
నాగభూషణం — ఇందిర

చలమయ్య : సహనా వవతు సహనౌ భునక్తు
సహవీర్యం కరవావహై
తేజస్వినా వధీతమస్తు
మావద్విషావహై

(శ్లోకం పూర్తయ్యాక, చిన్నగా గంటకొట్టి ఒకటి రెండుసార్లు పాడిదగ్గు దగ్గాక.)

చల : (మామూలుగా) ఏమోయ్, (క్షణకాలమాగి) నిన్నే నోయ్, (కొంచెం బిగ్గరగా) ఒక్కసారిలా రావే.

రాజమ్మ : (దూరంనుంచి) ఆఁ...ఓయ్... వస్తున్నా ... (వచ్చాక) వచ్చేలోపలే ఎందుకండీ అలాగ గావుకేక లేస్తారు ? నే నేమన్నా ఊరికే కూచున్నానా ఏమన్నానా ?

చల : లేదు లేదు. ఈ కొంపలో ఉన్నవాళ్ళంతా మహా విరగబడిపోతున్నారు. ఎటొచ్చీ ఏ పనీ చెయ్యాని సోమరి పోతునల్లా నేనే. నీ కేమో ఆవంటింట్లో బిజీ, నీసుపుత్రుడి కేమో మేడమీద గదిలో బిజీ.

రాజ : మేం విరగబడిపోతున్నామని చెప్పుకోలేదులెండి. ఇందు కేనా పనిమాలా పిలిచారూ? ఈ అనే రెండుముక్కలూ అక్కడికేవచ్చి అనలేకపొయ్యారూ, కూర వేపుకొంటూ వినేదాన్నిగా...

చల : పోతున్నావేమే పిలుస్తుంటే—చెప్పినమాట వినిపించు కోవేం? నీ తలబిరుసే ఆ వెధవకూ వచ్చింది. రామచంద్ర ప్రభో, రామచంద్రప్రభో, ఎక్కడున్నావయ్యా తండ్రీ!

రాజ : చప్పున తేల్చండి బాబూ. అబ్బాయి భోజనానికివచ్చే వేళయింది,

చల : ఏమిటో అంత అర్జంటుపనులు? మళ్ళీ క్షణం తీరిక వుండదు; దమ్మిడీ ఆదా వుండదు.

రాజ : వాడిజీవితం అలాగే గడుస్తుందేమో, ఎవరుచూశారు లెండి.

చల : ఎప్పుడు ఏమిజరిగినా జరగొచ్చనే మచ్చుంటేనే నాకు కిట్టదు. ఎప్పుడు మంచిజరిగినా జరగొచ్చనే సజ్జును అసలే భరించలేను.

రాజ : ఏమిటండీ! మచ్చు, సజ్జు అనుకొంటూ మీగ్గాంగ సరిపోయిందిలెండి. ఎవరైనా వింటే నవ్విపోతారు గానీ ఇకూరుకోండి.

చలం : పిచ్చిదానా, నిజం భరించలేనివాళ్ళు, అచ్చం నీలానే మాట్లాడుతారు. ముందేదో జరుగుతుంది గదా అని – చేతులు ముడుచుకు కూచోవటం నాకు సరిపడదు. నేనలా ఉండలేను. ఇంకోరుఉన్నా నేను సహించలేను. సరా?

రాజ : ఇన్నిటికీ ఇప్పుడేం చెయ్యమంటారండీ?

చల : ఎల్లుండి మంగళవారం దివ్యమైన రోజు. నేను కర్ల పాలెం వెళ్ళొద్దామను కొంటున్నాను.

రాజ : వెళ్లిరండి. దానికింత హరి గోలెందుకూ?

చల : వెడతాను సరేనే – చిన్నమ్మాయ్ అడిగితే దానికేం చెప్పమన్నావాని?

రాజ : ఇంకేం చెబుతారు? అంతా కులాసాగా ఉన్నారనండి. కిందటి సారొచ్చినపుడు అటుకులు కావాలంది. రెండు మానికలు కడతాను కాని ఇచ్చిరండి...ఎందుకలా నెత్తి నెత్తి బాదుకొంటారు?

చల : నాఖర్మ కాలిపోయి, సరేనా ... అది గాదే నిద్ర పెద్దమ్మా – నిద్రపెద్దమ్మా అని – అప్పుడే శేషగిరి బావ పిల్లపెళ్ళికి తొందరపడ్డాడు గదా. ఇప్పుడు వెడితే, ఆ సంగతి కదలెయ్యడుటే నీ దుంపతెగ. నీ కామాత్రం ఇంగితం కూడా లేదు.

రాజ : నా ఇంగితం పరీక్ష చేతామనుటండీ, మీరింత డొంక తిరుగుడుగా మాట్లాడుతున్నది – పైన ప్రకాశం ఉన్నాడుగా వెళ్ళి అడగండి.

చల : నిన్నా మధ్య అడిగి చూడమంటెనిగా–మరి అడగలా?

రాజ : అడిగాను.

చల : ఏమిటట?

రాజ : ఏమో, నాతో ఏ సంగతీ చెప్పలేదు. అంతా విని మెదలకుండా ఊరుకొన్నాడు.

చల : వాడు చెపల వాజమ్మన్న సంగతి నాకు తెలుసననుకో. వాడూరు కొంటాడు. నువ్వెలా ఊరుకొన్నావా అని – నాకదే చిత్రంగా ఉందిసుమా.

రాజ : ఉరెట్టుకోనా మరి ?

చల : మీా ఇద్దర్కి మధ్యా పడ్డందుకు భగవంతుడు నాకా రాతే రాశాడన్న సంగతి నాకు తెలుసు గానీ—ఇన్నిటికీ శ్రీవారి ఉద్దేశ మేమిటట ?

రాజ : ఎన్నిసార్లు చెప్పనండీ స్వామీా. వాడు పలకలేదోయ్ దేవుఁడా అంటే — నా ప్రాణం తోడేస్తుంటిరి. ఎట్లాగమ్మ ఈ మనిషితో వేగడం ?

చల : ఏదో విధంగా—ఆంతర్యం లాగి చూడక పోయావుటే ?

రాజ : ఆ ప్రయివేటు పని చెయ్యడానికి మీా రుండనే వుంటిరిగా — వాడిముం దీ పోకిళ్ళన్నీ పోవడానికి నా ప్రాణం వొప్పదు ... నే పోతున్నా.

చల : ఇదిగో (బిగ్గరగా) ఏయ్ ... నిన్నే నే ... ఒక్కసారి. ఆ కుమారారాజాగారిని, అంతఃపురంనుండి రమ్మని చెప్పు... (మామూలుగా) భార్యామణి తంతు ఇలా అఘోరించింది. కుమారరత్నం గారి తంతేమో....

ప్రకాశం : (వస్తూ) పిలిచావా నాన్నా ? (వచ్చి) ఎందుకు నాన్నా పిలిచావట ?

చల : మంగళవారం కర్లపాలెం వెడదామనుకొంటున్నా రా.

ప్రకా : వెళ్ళిరా నాన్నా. తెల్లవారు జామునే సోమాయిని పిల్చి బండి గట్టమని చెబుతాను.

చల : ఇంతోసి దూరానికి బండిగూడా ఎందుగ్గానీ —

ప్రకా : దూరమని కాదు నాన్నా, ఇందిర ఏవో పుస్తకాలు కావాలని మొన్న ఉత్తరం రాసింది. కొని రెడీగా ఉంచాను. బండయితే —

చల : పోనీ నువ్వే రాకూడదటోయ్, అన్ని విషయాలూ, ముఖాముఖి మాట్లాడుకోవచ్చుగా.

ప్రకా : ఏమున్నయ్ నాన్నా, ఎదురుబడి మాట్లాడుకోవడానికి —

చల : అహాఁ, అదికాదురా ....

ప్రకా : మామూలు సంగతులేగా, అందులో నువ్వు స్వయంగా వెడుతుంటివాయె.

చల : శేషగిరి బావతో ఏం చెప్పమన్నావురా మరి?

ప్రకా : అంతా క్షేమంగా ఉన్నారని చెప్పు.

చల : వచ్చే చైత్రవైశాఖ మాసాల్లో లగ్నాలున్నాయట, ఏదో వో లగ్నం ఖరారు చేసుకొస్తాను...మాట్లాడవేరా?

ప్రకా : ఇప్పుడేం తొందర్లే నాన్నా, నా కన్నా పెద్దవాళ్లే ఇంకా పెళ్ళీ, పెటాకులూ లేకుండా ఉంటున్నా రీ రోజుల్లో.

చల : మనముంటాం సరేనా. అవతల ఆడపిల్లవాళ్ళుండొద్దూ? ఇందిర ఈ దేరికూడా నాలుగేళ్ళు కావస్తోందిగదా. వాళ్ళు మాత్రం ఇంకెంత కాలమని ఊరుకొంటార్రా?

ప్రకా : ఇందిరకు పెళ్ళి చెయ్యొద్దని మన మెందుకంటాం నాన్నా? వాళ్ళిష్టమొచ్చినప్పుడు చేసుకోమను. అందుకు మన పర్మిషన్ దేనికి?

చల : (నిట్టూర్చి) ప్రకాశం.

ప్రకా : ఊఁ...

చల : ఈమాత్రం డొంకతిరుగుడు సమాధానాలు చెప్పడం నీ కొక్కడికే చాతనవుతుం దనుకోను.

ప్రకా : నువ్వనుకోవటమేగానీ, ఇందులో ఏదీ డొంకతిరుగుడు కాదు నాన్నా! నా అభిప్రాయం అడిగితే చెప్పాను.

చల : వాళ్ళు నీ మీద కొండంతఆశ పెట్టుకొని కూచున్నార్రా.

ప్రకా : పోనిండి. ఇప్పటికన్నా నేను నమ్మదగ్గవాణ్ని కాదని తెలుసుకొంటారు. అదే పదివేలు.

చల : ఏదో మేనత్త మేనమామ బిడ్డలని చూడటంగానీ— ఈ మాత్రం సంబంధం వాళ్ళకు దొరకదట్రా.

ప్రకా : నాకు తెలియదు.

చల : నాకు తెలుసు. ఇవ్వాళ శేషగిరిబావ ఊఁ కుక్కల్లాగా ఇంటిముందు పడుండేవాళ్ళు కొల్లలున్నారు. తెలిసిందా? వెనకటికి నీలాంటివాడే పిలచి పిల్లనిస్తానంటే ఎత్తి కుదేశాట్ట.

ప్రకా : ఆ తప్పు కుదేసినవాడిదికాదు — వెంటబడి పిల్లనిస్తామన్నవాడిది. వాడు, నాకొద్దుమొర్రో అంటున్నా తరుము కెడుతున్న మనిషిమీద — చులకన కలుగుతుందిగాని, గౌరవ మెందుకుంటుంది నాన్నా.

చల : (గంభీరంగా) నాయనా, నువ్వు చిన్నవాడివి. అర్థం శుభం తెలీనవాడివి, నామాట విను. హాయిగా మహారాజు బిడ్డలా బతుకుతావు. శేషగిరిబావ ఇప్పుడు లకారాలు చూస్తున్నాడు. ఒక్క కూతురు. ఉత్తరోత్తరా ఆ స్తంతా నీ చేతికొస్తుంది. సుఖోపాయంగా కాలుమీద కాలువేసుకొని, నీ మునిమనవలు గూడా బతకొచ్చు. సిద్ధాన్నం పాడుచేసుకోకు బాబూ, నీకు తెలియదు.

ప్రకా : డబ్బున్నవాళ్ళంటే నాకు గిట్టదు నాన్నా—ఎంచేతనంటే—

చలం : నీ కదిలేదుగనుక. అసూయపడటం వేరూ, దానికి దూరంకావటం వేరూనూ. నువ్వా రెంటిని కలగాపులగం చెయ్యకు. (క్షణమాగి) ప్రకాశం...నీ అంత చదువుకో లేదేమోగాని, నీకన్నా ఎక్కువ జీవితం జీవించాను. ఎన్నో ఢక్కా మొక్కలు తినితిని, ఈ నెత్తి బొప్పికట్టింది.

ప్రకా : ఇప్పుడెందుకు నాన్నా ఆ సంగతులన్నీ ?

చల : (వినిపించుకోకుండా) డబ్బును ద్వేషించిన కొందికీ, మనిషి, దాని దగ్గరకు జరుగుతూనే ఉంటాడు ప్రకాశం. నిన్నకాక మొన్న కళ్ళు తెరచిన పసిగుడ్డువు. నీకేం తెలుసురా, డబ్బంటే? (క్షణమాగి తనలో తను అనుకొంటున్నట్లుగా) ఒక పావలా కోసం ఎదురయిన ప్రతివాణ్ణీ దేహీ అన్నరోజులు, ఒక్కపూట తిండికోసం, నాలుగు చెంగులూ ముడేసిన రోజులూ నే చూచాను. నీకీ సంగతులేమీ తెలియవు ప్రకాశం. తెలియకూడదని గూడా నే ననుకున్నాను. చిన్నమ్మాయికి పెళ్ళయ్యేంతవరకూ, మా నాన్న నీళ్ళ కావిళ్ళుమోసి మమ్మల్ని సాకాడు. మా అమ్మ వంటలొండి పోషించింది. ఎన్నితిట్లు, ఎన్ని అవమానాలు, ఎంత నిరసన, ఎంత అగౌరవం భరించామో నాకు తెలుసు. దరిద్రంకన్నా, ఘోరమైన వ్యాధి ఈ ప్రపంచంలో మరేదీ లేదు. ప్రకాశం! దరిద్రుడికి ఆనందం లేదు, సుఖం లేదు, గౌరవం లేదు, విలువ లేదు, ఏ—మీ— లేదు. ఇవన్నీ నీ కుండాలని, నువ్వు మనిషిగా బతకాలనీ నేను — తండ్రిగా కోరుకొంటున్నాను. ఆ తరువాత నీ యిష్టం...

ప్రకా : (గద్గదికంగా) నాన్నా!

చల : తప్పుచేసి, పశ్చాత్తాప పడటంకన్నా అసలు తప్పే చెయ్యకపోవటం ఉత్తమం. ఆలోచించి చెప్పు...బిగ్గరగా — ఒసేవ్, ఆ ఉత్తరీయ మిలా అందుకురా.

రాజ : (దూరంనించి) ఓయ్......వస్తున్నా. (క్షణమాగి వచ్చాక) ఇంద ఉత్తరీయం, పొద్దుపోయిందిగదా, ఏకంగా భోంచేసి వెళ్ళగూడదుటండీ ?

చల : (మాట్లాడకుండా వెళతాడు, అడుగుల ధ్వని)

రాజ : ప్రకాశం!

ప్రకా : (పలకడు)

రాజ : (అందుకొని) అలా ఉన్నావేంరా, ఎక్కడికిరా, మీ నాన్న వెళ్ళింది? (క్షణమాగి) ఏం జరిగింది నాయనా?

ప్రకా : ఏమీ లేదమ్మా.

రాజ : మరి అలా ఉన్నా వెందుకురా?

ప్రకా : (బాధగా నవ్వి) ఎందుకమ్మా అంత గాభరాపడతావ్. నేను మామూలుగానే ఉన్నాగా?

రాజ : మీ నాన్న కోపడ్డాడా? (చిరుకోపంతో) అసలా మనిషి ధోరణె అలాంటిది. ఎదటి వాళ్ళు ఏమనుకొంటారో నని గూడా చూడ్రు. ఎంతమాట బడితే అంతమాట అనేస్తారు ఛి ఛి...

ప్రకా : (చప్పున) అదేం లేదమ్మా .... నాన్నేదో చెబుతుంటేను —

రాజ : కర్లపాలెం — మీ మేనత్త సంగతేనా?

ప్రకా : చెబుతుంటే వింటున్నాను.

రాజ : ఏమన్నావు నాయనా?

ప్రకా : నేనింకా ఏ సంగతీ అనలేదు. ఆలోచించి చెబుతా నన్నాను.

రాజ : ఇందులో—పెద్ద—ఆలోచించాల్సిందేముంది బాబూ? ఇందిర నీకు తెలీంది కాదు గదా? నీ మనసులో ఉన్న మాటేదో, పోనీ—నా చెవిని వెయ్యి.

ప్రకా : నీ ఉద్దేశమేమిటమ్మా? నాతో దాచకుండా చెప్పవూ?

రాజ : నీదగ్గర నాకు దాపరిక మేమిట్రా నాన్నా. నువ్వు వెయ్యేళ్ళపాటు సుఖంగా ఉండటమే నాక్కావాలి.

ప్రకా : ఆ సుఖం — ఇందిరను చేసుకొంటే వస్తుందామ్మా.

రాజ : (నిట్టూర్చి మౌనంగా ఉండిపోతుంది.)

ప్రకా : మాట్లాడవేఁ అమ్మా.

రాజ : అన్నిటికీ ఆ భగవంతుడే ఉన్నాడు నాయనా. ముందు ముందు జరగబోయే సంగతుల్ని గురించి, అప్పుడప్పుడే మనం ఎలా చెబుతాంరా?

ప్రకా : పోనీగానీ అమ్మా! కృష్ణమూర్తి మామయ్యగారి, అత్తారు బాగా డబ్బున్న వాళ్ళు గదుటే?

రాజ : వాళ్ళకేంరా, జమీందారీ బిడ్డలు.

ప్రకా : మామయ్య వాళ్ళింట్లోనే ఉంటున్నాడు గదుటే అమ్మా? సుఖంగా ఉంటున్నాడా మరి?

రాజ : మా అమ్మ కడుపున పుట్టిన వాళ్ళల్లో, మా రెండో తమ్ముడిదే ముదనష్టపు బతుకయింది బాబూ. మిగతా వాళ్ళు, ఉన్నా లేకపోయినా, హాయిగా బతుకుతున్నారు. నిలువెత్తు డబ్బుతో ఉండిగూడా, మా కిష్టుడు నిష్టదరిద్రం అనుభవిస్తున్నాడు ... ఏమిటో బాబూ! ఒక్కొక్కడి నొష్టన దేవుడలా గీసి పెట్టుంచుతాడు.

ప్రకా : అలా అంటావేమిటమ్మా. సుభద్రత్తయ్య, మామయ్యంటే అంత అంగలారుస్తుటుంది గదా, నువ్వింకోలా చెబుతావేం ?

రాజ : ఇలా వెళ్లి అలా వచ్చేవాళ్ళకి సంగతులు ఏమీ తెలీవు నాయనా. నువ్వు నాలుగేళ్ళ పిల్లాడప్పు డోసారి ఆ కొంపకెళ్ళి, నెల్లాళ్లుండొచ్చాను. ఆ నెల్లాళ్లూ, ఆగభోగం అంకమ్మసివాలుగాఉంది నాపని. నరకయాతన పడ్డానంటే నమ్మునాయనా, అప్పటికి ఇప్పటికీ మళ్ళా నే నా గడప తొక్కలేదు. కిష్టుడే ఎప్పుడన్నా వొచ్చి పోతుంటాడు.

ప్రకా : అప్పుడేం జరిగిందమ్మా ?

రాజ : అప్పటికి మీ నాన్న వొద్దు వొద్దంటూనే ఉన్నారు. ఏదో తమ్ముడుగదా అని వెళ్ళాను. రెండు మూడు రోజులు బాగానే ఉంది. అక్కణ్ణించీ నిప్పు రాజుకొంది. ఒక రోజునేం జరిగిందంటే నాయనా, మా కిష్టుడు...

(ఫ్లాష్‌బాక్)

కృష్ణమూర్తి : ఏమోయ్...ఆఁ నిన్నే నోయ్...ఓ సుభద్రా.

సుభద్ర : వస్తూ నన్నా పిలుస్తూంట.

కృష్ణ : వినిపించదా యేం?

సుభ : అయ్, వోయ్ అంటూంటేనూ, పని మనిషి నేమో ననుకొన్నానండి. ఎందుకూ రంపటెల్లుతారు?

కృష్ణ : (సీదా తగ్గిపోయి) రంపటెల్లడం కాదు సుభద్రా. నీతో కాస్త పనుండి పిలిచాను.

సుభ : అలా చెవులు ఘుడియలు పడిపోయేట్టు గావు కేకలు వెయ్యకపోతే దగ్గరకొచ్చి చెప్పగూడదు?

కృష్ణ : ఎలా రాను చెప్పు సుభద్రా?

సుభ : ఎలా రావడమేమిటి? భగవంతుడిచ్చిన కాళ్ళింకా ఉన్నాయిగా?

కృష్ణ : (కంగుతిని) అదిగాదు సుభద్రా, అవతల నువ్వేమో, స్నేహితుల్తో కూచుంటివి. అక్కడికొస్తే బావుండదనీ—

సుభ : ఒస్సోసి...ఎంత నంగనాసి తుంగబుర్రమ్మా—అంచాతనే గౌరవంగా అయ్, వోయ్ అని నోటికొచ్చినట్లల్లా పిలేస్తున్నారు.

కృష్ణ : సుభద్రా!

సుభ : ఆఁ నా బొంద సుభద్ర, ఇన్నేళ్ళొచ్చాయి. బొత్తిగా మేనర్స్ తెలీవేమండీ? మీ ముద్దు పలుకులు విని, వాళ్ళంతా చచ్చేట్టు నవ్వుతున్నారు.

కృష్ణ : అదిగాదు సుభద్రా. నేనూ—

సుభ : ఈ సోదంతా వినలేను స్వామీ! ఈ రామాయణం ఎప్పుడూ ఉండేదీ గానీ ఎందుకు పిలిచారో చెప్పండి.

కృష్ణ : ఆఁహాఁహా....మరేం లేదు. సుభద్రా...నేనూ... అదేనే నాకూ....

సుభ : డబ్బేమన్న కావాలా?

కృష్ణ : ఎంతో అక్కర్లేదు పాతిక చాలు.

సుభ : నిన్నేగా పది పుచ్చుకొన్నారు? ఏం చేశారదంతా?

కృష్ణ : దానికి దీనికి అయిపోయింది, సుభద్రా!

సుభ : ఈ దానికీ, దీనికీ అర్థంలేదా యేం?

కృష్ణ : సరిగ్గా జ్ఞాపకం లేదు, సుభద్రా!

సుభ : కొన్న వస్తువులు చిన్నవీ చిదకవీ అయితే జ్ఞాపకం లేదనుకోవచ్చును. నా తలకాయంత బొమ్మలు కొంటిరి. అదీ జ్ఞాపకం లేదుటండీ?

కృష్ణ : అబ్బబ్బబ్బే. అదిగాదు సుభద్రా!

సుభ : ఇలాంటి ముచ్చు వేషాలు నా దగ్గర వెయ్యకండి. మేనల్లుడికి కొనిపెట్టుకుంటే, మీ ముల్లెతో నిక్షేపంగా కొనిపెట్టుకోండి. అంతేగానీ, మా ప్రాణాలుతోడి, పుట్టింటి వాళ్ళను మెప్పించవద్దు.

కృష్ణ : మెల్లగా మాట్లాడు సుభద్రా — ఈ పక్కగదిలోనే మా అక్కయ్య ఉంది.

సుభ : వింటే తలగొట్టి మొలేస్తుందా? అంత పౌరుషమున్న మనిషయితే, నా డబ్బు చిల్లికానీ ముట్టుకోమనకండి. మీరు ముట్టుకోకండి. చాతగానివారికి రోషా లెక్కువట!

కృష్ణ : (దీనంగా) ఏం మనిషివి సుభద్రా నువ్వు.

సుభ : ఉన్న మనిషేమో ఇది. ఈ మనిషి మీ కిష్టమో కాదో తీరిగ్గా ఆలోచించుకొని చెప్పండి .... ఇందు ఈ రెండూ జేబు ఖర్చుకుంచుకోండి, మళ్ళా నాలుగో తేదీ దాకా దమిడీ ఇచ్చేది లేదు.

*　　*　　*

ప్రకా : ఏమిటమ్మా ఇదంతా?

రాజ : ఇలాంటి వెన్నో కిష్టుడు కడుపులో పెట్టుకొని, గుమ్మడికాయలా కుళ్ళిపోతున్నాడు నాయనా! లక్షాధికారి అల్లుడయ్యా డన్నమాటేగానీ దమ్మిడీ ముట్టుకొనే ప్రాప్తం లేదు.

ప్రకా : ప్చ్ .... ఎవర్ననీ లాభంలేదమ్మా. ఈ తప్పంతా డబ్బుది. డబ్బున్నవాడి కంటికి ప్రతిది చాలా హీనంగా కనిపిస్తుందమ్మా. దాని కున్న గుణమే అలాంటిది.

రాజ : ఏం డబ్బు నాయనా, పాపిష్టి డబ్బు, లేకపోతే పీడా బోయిరి. గంజన్నా తాగి బతకొచ్చు గానీ, జీవితాని కింత శాంతనేది లేకపోయాక, ఏముండేం, ఏం లేకేం ?

ప్రకా : అందుకనే — ఇందిర విషయం నేను కాదంటున్నా నమ్మా.

రాజ : (బిత్తరపోయి) ఛ ఛ .... అదేమిట్రా ? దానికి దీనికి సాపత్యమేమిటి ?

ప్రకా : ఎందుకు లేదమ్మా. ఎక్కడున్నా, ఎవరి దగ్గిరున్నా డబ్బు — దాని సహజ గుణాన్నది వొదలిపెట్టదు. ఒకోక సారి ఆలస్యంగా బైటపడుతుంది.

రాజ : అబ్బెబ్బెబ్బె, అట్లా అనబోకయ్యా. ఎవరిరాత వాళ్ళదీ. వాడి ఖర్మగాలి, అలా అయ్యాడు గదాని-అంతా అలాగే అవుతారట్రా ?

ప్రకా : ఇంకొకరి అనుభవాన్నుండి నేర్చుకోని మనిషి మనిషే కాడమ్మా. చూస్తూ చూస్తూ నన్నిలా గంగలో దూక మంటావే అమ్మా ?

రాజ : (నిట్టూర్చి) అయ్యో, నాయనా, నేనేం చెయ్యనురా.

ప్రకా : నువ్వు మనస్ఫూర్తిగా ఇందూను చేసుకోమంటే చేసుకుంటానమ్మా. నేనేమయిపోయినా, కనీసం మీరన్నా తృప్తిపడతారు. మరి అలా చేయమంటావుటే అమ్మా ?

రాజ : ఏం తిప్పలు తెచ్చిపెట్టావురా భగవంతుడా! ఇప్పటికే వాళ్లూ, వీళ్లూ, మీ అబ్బాయి పప్పన్నం పెట్టలేదేమంటే, చెప్పలేక ఛస్తున్నాను గదా —

ప్రకా : పెడతామని చెప్పమ్మా ?

రాజు : (విస్మయంగా) అంటే ఏమిట్రా నాయనా! అలా నవ్వు తావ్. కాస్త నాకు తెలిసేట్టు చెప్పరాదుట్రా?
ప్రకా : పప్పన్నం పెడదామని చెప్పమంటున్నానే.
రాజ : అంటే – ఇంకెక్కడన్నా – పిల్లను చూసుకొన్నావా ఏమిటిరా నాయనా?
ప్రకా : నీకెలా తెలిసిందమ్మా!
రాజ : ఎవ రమ్మాయిరా? ఏవూరూ, ఏమిటి?
ప్రజా : వాళ్ళూ పట్నంలోనే ఉంటున్నారమ్మా. పాపం, చాలా పేదవాళ్ళు.
రాజ : ఆయనేం చేస్తున్నాట్ట!
ప్రకా : ఏదో బళ్ళో మేష్టరు ఉద్యోగం. డెబ్బయ్‌గావును ఇస్తార్ట. నలుగురు ఆడపిల్లలు, ముగ్గురు మొగపిల్లలు ఉన్నారు.
రాజ : ఏమో నాయనా. నాకంతా అగమ్యంగా ఉంది. ఆ.... ఆయ నెవరో, ఎలాంటివాడో, ఆ పిల్లను చేసుకోవ టానికి మీ నాన్న ఒప్పుకొంటాడో లేదో—
ప్రకా : ఆయన గంగిగోవు లాంటి వాడమ్మా. శివరామయ్య గారంటే, ఆ వీధివీధంతా, ప్రాణాలు విడుస్తారంటే నమ్ము.
రాజ : (ఉలిక్కిపడి) ఎవర్రా? శివరాం...అయ్యగారా?
ప్రకా : ఎంత మంచి వాడనుకొన్నావ్ అమ్మా, ఆయన్ను చూస్తుంటే కడుపు తరుక్కుపోతుంది అనుకో. జీవితంలో ఎక్కడో తప్పిపోయినట్టుగా, దిగులుతో కుమారిల్లి పోతున్నట్లుగా ఉంటాడు. సగం ఆయన బాధ చూడలేకే రాజ్యలక్ష్మిని చేసుకుంటానన్నాను...అదేమిటే, అమ్మా, అయ్యో, ఎందుకే అలా కళ్ళనీళ్లెట్టుకుంటావ్?

రాజ : (గాద్గదికంగా) ఏమీ లేదు నాయనా.

ప్రకా : అంటున్నావుగానీ, ఏమీ లేకపోతే, అలా గుటకలు మింగుతూ ఏడుస్తావుటే నువ్వు ?

రాజ : (ఏడుపు గొంతుతో) లేదు బాబూ, ఏమీ లేదు. నే నేడవటం లేదు...ఏడవను...

ప్రకా : నాతో చెప్పవా అమ్మా ?

రాజ : (దగ్గి గొంతు సవరించుకొని) ఛ...ఛ...ఏమీ లేదు నాయనా. నువ్వా పేరనగానే – చిన్నప్పుడు – అమ్మమ్మ గారింటి ప్రక్కనే–ఆ పేరుగల మనిషి జ్ఞాపక మొచ్చాడు. అందుకనే – కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ప్రకా : మన సంగతులన్నీ చెప్పానమ్మా. ఆయన చాలా సంతోషించాడు. మనింటికి రమ్మని ఎన్నో సార్లు బలవంతం చేశాను. రానంటే రానన్నాడు.

రాజ : తప్పకుండా, నువ్వాపిల్లనే చేసుకో ప్రకాశం. నాన్నతో నేనూ చెబుతాను. ఆయన విన్నా, వినకపోయినా, నువ్వు మాత్రం – నీ సుఖం కన్నా నాకేం కావాలి నాయనా.

ప్రకా : నువ్వు చాలా మంచిదానివమ్మా. చాలా చాలా మంచిదానివి. ఆకాశమంత మంచిదానివి.

* * * *

(పట్నంలోని వీధిని సూచించేగోల. 'ఏయ్ తప్పుకో'—'బాబూ రిక్షా'—'ఏమిటయ్యా, అలా తోసుకొస్తావ్ ?'—'కళ్ళు కనబడ్డంలా'— వంటి కేకలూ, ముమ్మరంగా కారు హారన్లూ....క్రమంగా సన్నగిలి ఓ నిమిషంపాటు వినిపిస్తూనే ఉంటాయి. యీ గోల అణగారక ముందే–)

ప్రకా : అబ్బబ్బబ్బా, నా ప్రాణాలు తీసేశావ్ రాజ్యం.

రాజ్యం : మరీ నాజూకులు పోకండి. సినిమా చూట్టమంటే ప్రాణాలు తీసుకోవడమా ఏమిటి ?

ప్రకా : ఈ దిక్కుమాలిన కత్తి యుద్ధాల సినిమాలకంటె, ప్రాణం తీసుకోవడమే మంచిది.

రాజ్యం : అలాగేం?

ప్రకా : కాదుటేమరి? అది పది నిముషాలబాధ. ఇది నాలుగు గంటల బాధ. అందులోనూ మాటినీకి రావడం.

రాజ్యం : ఈ ప్రపంచంలో మీకు బాధలేనిదేమిట్లెండి? అన్నీ బాధలే. ముష్టి ముప్పావలా టికెట్టు కొన్నామో లేదో, ఊరికే వలవల్లాడి పోతున్నారు ఇందాకణ్నించీ...

ప్రకా : ముష్టి ముప్పావలా ఏమిటి రాజ్యం? ఆ ముప్పావలా రావాలంటే నేను నాలుగు గంటలు అడ్డమయిన చాకిరీ చెయ్యాలి, తెలుసా?

రాజ్యం: ముప్పావలాకోసం మీరింత ఏడుస్తారనుకుంటే — ఈ సినిమాకే రాకపోదును...

ప్రకా : ఇన్నేళ్ళొచ్చాయి. ఇంకా నీకు డబ్బువిలువ తెలియక పోతే ఎట్లా రాజ్యం?

రాజ్యం: స్వామీ, బుద్ధితక్కువయింది. ఆర్నెల్లనుంచీ అడుగు తుంటే, ఇవ్వాళ్ళ పిక్చరు చూపించారు. చూచిన ఫలితం లేకుండా వెనకాతలి నస మొదలెట్టారు...

ప్రకా : ఈ ముప్పావలా ఇంకోదానిమీద ఖర్చయితే నాకింత విచారం ఉండకపోను. వృథాగా, ఆ విలువకు తగ్గ ఫలితం పొందకుండా...

రాజ్యం : ఏ పప్పుమీదో, మజ్జిగమీదో అయితే—బావుండేది గదండీ?

ప్రకా : (కసిగా) తప్పకుండా.

రాజ్యం: (రెచ్చిపోయి)దిక్కుమాలిన తిండి, కుక్కలూ తింటున్నయ్. మనమూ తింటున్నాం. వేళకింత తినడం ఓగొప్పే నయిపోయే — ముష్టిగొప్ప.
ప్రకా : పిచ్చి రాజ్యం, పిచ్చిరాజ్యం. ఈ క్షణాన, ఈ పట్నంలో ఎంతమంది, కడుపుమంటతో భగ్గుమంటున్నారో తెలిస్తే నువ్విలా మాట్లాడవనుకుంటాను.
రాజ్యం : మనమేదో దేవేంద్ర భోగా లనుభవిస్తున్నట్టు మాట్లాడకండి. మనబతుకూ అంతేగా ? మనం మాత్రం- ఎన్నిసార్లు, కటిక పస్తులు చేశాముగాదు ? ఎన్నిసార్లు, గిన్నె చెంబూ తాకట్టు బెట్టుకున్నాంగాదు ?
ప్రకా : నీకు మరీ మతిలేదు రాజ్యం — ఎవరన్నా వింటారేమోనన్న సిగ్గుగూడా లేకుండా పోయింది.
రాజ్యం : అది మనం దాచినా ఇక దాగదు లెండి. బాకీల వాళ్ళు, ఈ సరికి మనకీర్తి చంద్రికల్ని దశదిశలా విరజిమ్మే ఉంటారు...

(దూరం నుంచి కారు దగ్గర కొస్తున్న చప్పుడు....)

రాజ్యం : అయ్యో, మన సంగతి నలుగురికీ తెలిసే, అన్న బెంగ మరక్ఖర్లేదు ... కొంతమంది ప్రచారంకోసం బోలెడంత ఖర్చు పెడతారట... మన కది ఉచితంగా దొరుకుతోంది. ఎంత అదృష్టముండాలి దానికి ?
ప్రకా : (బిగ్గరగా) రాజ్యం, రాజ్యం కారొస్తోంది తప్పుకో — రాజ్యం!

(కారు రయ్ మని వచ్చి, పెద్ద చప్పుడుతో ఆగిపోయాక)

ఒకస్త్రీ గొంతు : (విసుగ్గా) ఏమిటమ్మా అలా రోడ్డు కడ్డంగా నడుస్తావ్ ? పక్కగా నడవలేవూ !

రాజ్యం : నువ్వు తప్పు కెళ్ళలేవూ? మాకేగాంగ కాల్లన్నా యని — ఓ — విసురు ఒకటే విసురు — ముష్టి విసురు.

స్త్రీగొంతు : అట్టే మాట్లాడక మ్మా. తప్పు కెళ్ళబట్టే బ్రతికావ్.

రాజ్యం : లేకపోతే మీదిగా తోలే దానివా!

ప్రకా : రాజ్యం. ఇలా రావోయ్. రోడ్డుపొంచనే నడవక పోవటం మందేపొరబాటు. (ఆగాక) మీరు వెళ్ళండమ్మా.

స్త్రీగొంతు : బావా?

ప్రకా : ఎవరది?

స్త్రీగొంతు : నేనే బావా, ఇందిరని—

ప్రకా : ఓ — ఇందు — ఇందిరా! కులాసాగా ఉన్నావా ఇందిరా?

ఇంది : ఇదో కనిపిస్తున్నాను గాదూ — దుక్కలా?

రాజ్యం : యీమె మీకు తెలుసునా ఏమండీ?

ప్రకా : అన్నట్లు మరిచిపోయాను. ఇందిరా — ఇందిరా — యీవిడ—ఆః అదన్నమాట రాజ్యం—యీమె, నా మేన గోడలు ఇందిర—

ఇందిర : నమస్కారమండి అక్కయ్యా, (క్షణ మాగాక) యీ ఊళ్ళో ఉండిగూడా ఒక్కసారి మా ఇంటికి రాలేదేం బావా? రాగూడ దనుకొన్నావా?

ప్రకా : ఏదనుకోవటానికయినా, మీ రిక్కడుంటున్నట్టు నాకు తెలీదు ఇందిరా! తెలిస్తే రాకుండా ఉంటానా?

ఇంది : పోనీ — ఇప్పుడు తెలిసిందిగా, వెడదాం రా బావా!

ప్రకా : ఇప్పుడా? కాదు కాదు. ఇంకోసారొస్తాను.

ఇంది : ఇన్ని అబద్ధా లెప్పుడు నేర్చావోయ్ బావా! (నవ్వు తుంది).

ప్రకా : పైగా ఇదొకటా.

ఇంది : కాకపోతే, నువ్వన్న మాట కేమయినా అర్థముందా? ఇప్పుడేమో 'ఇల్లు తెలిస్తే రాకపోయానా?' అంటివి. తెలిశాక రమ్మంటేనేమో, 'ఇప్పుడు – కా' దంటుంటివి.

రాజ్యం : ఆవిడంతగా ఇదవుతుంటే, పోనీ వెళ్ళకూడదటండీ? ఎప్పుడూ ఉండే ఇల్లేగా మనది.

ఇంది : (ఫక్కున నవ్వి) ఆఁ అలా నాకు అసరాగా నిలబడాలక్కయ్యా నువ్వు. ఈఁ కారెక్కు. ముందు నువ్వెక్కక్కయ్యా. బావ – వెనకాతలే పరుగెత్తుకొస్తాడు. (నవ్వుతుంది).

రాజ్యం : రండీ, అలా నిలబడతారేం?

(పావు నిముషం కారు నడిచి ఆగుతుంది. తరువాత తలుపు తడుతున్న చప్పుడు.)

ఇంది : అంజమ్మా! అంజమ్మా (మళ్ళీ తలుపు చప్పుడు.)

ఇంది : లోపలెక్కడో కూలబడి ఉంటుంది. (బిగ్గరగా) అంజమ్మా, (తలుపు తీసిన ధ్వని.)

ఇంది : అంజమ్మా! వేణ్ణీలుపెట్టు. ముందు మూడు కాఫీ, ఫలహారమూ తీసుకురా. సరే – యీ పని గానివ్వు. (క్షణమాగి) అయ్యో, అలా నిలిబడే ఉన్నావేమక్కాయ్! కూచో...ఆఁ...బావ కేమొచ్చిందే అక్కయ్యా, ముందు నువ్వు కూచో, నువ్వూనోయ్ బావా!...చప్పున కాఫీ పట్టుకొస్తాను...అందాకా... (వెళ్ళుతుంది)

రాజ్యం : ఏమండీ, ఇందాకణ్నించీ నా కర్థకాకుండా ఉంది, మేనగోడలంటే ఎట్లా మేనగోడలో, ఏమిటీ?

ప్రకా : మా మేనత్త కూతురు.

రాజ్యం : ఓహో...ఇప్పుడు తెలిసింది లెండి. ఇదివరకోసా రెప్పుడో చెప్పారు.

ప్రకా : గావును. నాకు జ్ఞాపకం లేదు.

రాజ్యం : ఈవిణ్నే గదండీ, మీా నాన్న చేసుకోమంటూ, మిమ్మలిని బలవంతం చేసిందీ?

ప్రజా : ఊఁ......

రాజ్యం : ఓ బోలెడంత డబ్బున్నదనీ, చాలా చాలా మేడ లున్నాయనీ, ఏవేవో కాంట్రాక్టు వ్యాపారాలు ఉన్నా యనీ చెప్పారు గాదూ?

ప్ర : ఊఁ....

రాజ్యం : ఒక్కతే గదండీ కూతురు?

ప్రకా : ఊఁ....

రాజ్యం : అయ్యో రామ అన్నిటికి ఊ,ఊఁ లేనామరండీ? అలా ముంగి ముశానంలాగా కూచుంటారేం?

ప్రకా : (విరాగ్గా) ఏం చెయ్యాలా?

రాజ్యం : మన బతుక్కి అదొక్కటే తక్కువయింది. మనకు లేవుసరేసరి—ఎదటివాళ్ళ కున్నాయన్నైనా సంతోషించరేం! యీా సోఫా చూడండి, ఎంత బాగుందో! మన బ్రతుకంతా కలిపి కూడినా, దీని ఖరీదు చెయ్యదు......

ప్రకా : చెయ్యదు...

రాజ్యం : ఆ బిళ్ళైరద్దం చూడండి. అబ్బ, నిలువెత్తద్దం...

ప్రకా : ఊఁ....

రాజ్యం : సరే, బాగానేఉంది. సంబరం—ఆ మూతివిరుపేమిటి? ముక్కు విరుపేమిటి? అయ్యో రాత. రాతా – ని.

ఇంది : (వస్తూ) అక్కయ్యా, నీళ్ళు రెడీగా ఉన్నాయి. స్నానాలు చేసేలోగా, కాఫీ, టిఫినూ, తయారవుతాయి.

ప్రకా : ఎందుకు, ఇందిరా, ఇదంతా? మేం వెడతాంగా?

ఇంది : మా ఇంట్లో కాఫీకూడా నీకు పనికిరాదా బావా?

ప్రకా : (బాధగా) ఛా...ఏం మాటలమ్మా అవి ఇందిరా? (క్షణమాగి) రాజ్యం, త్వరగా వెళ్ళిరా మరి.

(పావు నిమిషం విరామానంతరం.)

ఇంది : చాలా చిక్కిపోయావు బావా!

ప్రకా : మనం ఊరుకొన్నా పరిస్థితులు ఊరుకొంటాయా ఇందిరా!

ఇంది : ఏమిటో బావా, ప్రతిదాన్నీ పరిస్థితులు నెత్తిమీద రుద్దటం — నాకట్టే రుచించదు. చేజేతులా జేసుకుంటాం — ఫలితాన్ని ఇంకోరి కంటగడతాం. ఏదో పోనివ్వు బావా— పాడుగొడవగానీ, ఇప్పుడు ఏంచేస్తున్నావ్? ఎక్కడుంటు న్నావ్ ఏమిటీ?

ప్రకా : 50 రూపాయల ఉద్యోగం చేస్తున్నాను. ఆ జీతంతో సరిపెట్టుకొనేచోట ఉంటున్నాను...అన్నట్టు—మీ ఆయన కనిపించడేం ఇందూ—ఇందిరా!

ఇంది : కలకత్తా వెళ్ళారు. ఇంకో వారందాకా రారు ...... పోతే అత్తయ్యా, మామయ్యా, కులాసాగా ఉన్నారా బావా!

ప్రకా : అమ్మ ఈ మధ్యనే వచ్చి వెళ్ళింది. నాన్న నాతో మాట్లాట్టం మానేశాడు.

ఇంది : అప్పుడే జుట్టంతా నెరుస్తోందేం బావా? ఎన్నేళ్లున్నా యని?

ప్రకా : వయస్సుకు మించిన జీవితం జీవిస్తున్నప్పుడు, ఇలాంటి అదనపు లాభాలన్నీ తప్పవు ... అరె ... అదేమిటిందిరా కంటి ప్రక్కన ఆ మచ్చేమిటి?

ఇంది : (గాద్గదికంగా) ఏమీలేదు బావా!

ప్రకా : ఇదివరకు లేదుగదూ?

ఇంది : లేదు. ఒకప్పుడు బాగానే ఉండేది — ఆ మధ్యనే మచ్చ పడ్డది బావా!

ప్రకా : (బాధగా) పోనీ పొరబాటు జరగకుండా చూసుకోక పోయావా ఇందూ—ఇందిరా!

ఇంది : అది నా చేతుల్లో లేదు బావా! ఉంటే—వ్చ్—ఎమిటోలే బావా!

ప్రకా : ఏమి జరిగిందో నాతో చెప్పవా ఇందిరా? నేను వినగూడదా?

ఇంది : నీదగ్గర నేనేం దాచుకున్నాను గనక ఇది దాచు కొంటాను బావా! (నిట్టూర్చి) ఒక రోజున, నా పెట్టెకు తాళం వేయడం మరిచిపోయాను బావా ...

ఫ్లాష్ బాక్

నాగభూషణం : ఇందూ, ఇందూ, (బిగ్గరగా) ఇందిరా!

ఇంది : ఆఁ....

నాగ : ఇలారా.

ఇంది : (వచ్చి) ఏమండీ?

నాగ : కాలేజీలో చదువుకునేప్పుడు ... నీకు చాలామంది స్నేహితులుండేవాళ్ళా?

ఇంది : ఎవరికైతేమాత్రం ఉండరండీ?

నాగ : అలా డొంకతిరుగుడుగా చెప్పకు.

ఇంది : చాలామంది ఉండేవారు. ఇప్పుడేం?

నాగ : ఫోటోలు, పెట్టెల్లో దాచుకొనేంత దగ్గరి స్నేహితులుండేవాళ్ళని నాకు తెలీదే....మాట్లాడవేం? ఇదెవరిది?

ఇంది : ఒక...

నాగ : ఇక్కడెందుకుంది? ఎందుకుంచావ్? నీదగ్గర ఎలాంటి కుళ్ళూ లేకపోతే ఇంత కాలంగా నాకళ్ళకు కనిపించకుండా దీనిని దాస్తావులే?

ఇంది : ఫోటోలు దాచుకోడానికీ, కుళ్ళుఉండటానికి సంబంధం లేదు. కుళ్ళు ఉండేవాళ్ళు ఫోటోలు దాచుకోరు. కుళ్ళే దాచుకొంటారు.

నాగ : నోర్మూయ్, రాస్కెల్! (ఖంగుమని దెబ్బా—ఆ వెంటనే అమ్మా అంటూ ఇందిర కేకా-ఏడుపూ...)

* * *

ఇంది : ఇలా జరిగింది బావా!

ప్రకా : పోనీ, ఆ ఫోటోను పారెయ్యకపోయావా ఇందిరా? అనవసరంగా ఎంతమాట పడ్డావో చూడు—

ఇంది : బావా! (రుద్ధకంఠంతో) — నిన్ను — నిన్ను నే నెలా పారేసుకోను బావా! ఎలా పారేసుకోమంటావో చెప్పు.

ప్రకా : (నిలువునా కుంగిపోయి) ఇందూ, ఇందూ, అమ్మడూ! ఎంత మాటన్నావమ్మా! ఎంత మాటన్నావ్? (పావు నిమిషం విరామం....ఎక్కిళ్ళు)

ఇంది : బావా! స్నానమయినట్టుంది, అక్కడ్యోస్తోంది గానీ, నువ్వు యీరాత్రి ఉండిపోతావుగదూ?

ప్రకా : వెడతాను ఇందిరా!

ఇంది : ఈ ఒక్కరోజూ వుండవా బావా? ఎప్పుడూ, నిన్నేదీ అడగలేదు. ఇన్ని సంవత్సరాల తరువాత ఒక్కకోరి కేకోరు తున్నాను. దీన్ని తప్పకుండా...

రాజ్యం : (వస్తూ) ఏమండీ, మీరు గూడా స్నానం చెయ్య కూడదూ? నీళ్ళు మళ్ళా చల్లారిపోతాయేమో .... పోనీ మీరన్నా వెళ్ళిరండి. (ఇందిర వెళ్ళుతుంది)

ప్రకా : (కోపంగా) నీ ప్రవర్త నేమీ బావుండలేదు రాజ్యం.

రాజ్యం : ఏం? మీ గుసగుసలకు అడ్డొచ్చానని కోపంగా ఉందా?

ప్రకా : నాకు లేని దురుద్దేశా లంటగట్టబోకు రాజ్యం. నేను బొత్తిగా సహించలేను.

రాజ్యం : పైగా నాకు దురుద్దేశమంటారేమిటి? బావా, బావా, అంటూ ఆవిడ పూసుకు తిరుగుతుంటే లేదుగానీ, 'ఇదేమిటీ?' అనడం తప్పా? ఇదెక్కడి సోద్యమండీ, నే నెక్కడా విన్లా.

ప్రకా : (బిగ్గరగా) రాజ్యం.

రాజ్యం : ఇంతవరకూ నోటి భీకరమే ననుకొన్నాను. అమ్మ బాబో, చెయ్యిగూడా ఎత్తారే. ఏ పౌరుషం ఉన్నా లేక పోయినా, ఇదన్నా ఉండకపోతే ఎట్లా? ఏమోలెండి. ఆవిడతో కాస్త మంచిగానేఉండి రవ్వంత పెద్ద ఉద్యోగం సంపాదించండి. ఉందిగా కట్టుకుపోయినంత. మీ రడిగితే ఇవ్వదూ? మీకంత నామోషిగా ఉంటే — నేనే అడుగు తాను. ఎంతకాలం, ఇలా ఎలుకల్లా కలుగుల్లో బతుకుతాం?

ప్రకా : ఛీ, పశువా! ఇంతకాలం నిన్నుః మనిషి అనుకోవటం నాదే తప్పు. బురదలో కూరుకుపోతుంటే దాన్ని తెచ్చి భుజ మెక్కించుకొన్నాను. పిచ్చి కుక్కలా వాగుతున్నావ్. కావాలనుకొంటే, ఇంత ఐశ్వర్యంతోనూ, ఇందిర నాకు దక్కేది. నీకోసమనే, ఇదంతా త్యాగంచేశాను. ఆసంగతి నువ్వింకా గ్రహించినట్టులేదు.

రాజ్యం : ఇప్పుడే మీ అసలు రూపం బయటబడ్డది. దీన్నిబట్టి తెలియడం లేదా, మీరెంత స్వార్థపరులయిందీ? నన్నేదో ఉద్ధరించానంటారేమిటి పైగా. మీది అపరిమితమయిన కీర్తి దాహం. 'ఓహో త్యాగి — త్యాగి' అని పదిమందీ చేతా అనిపించుకోవాలని, నన్ను చేశ్యాడారు. ఇందిరను చేసుకొంటే మీకీ అవకాశమేది.

ప్రకా : రాజ్యం, రాక్షసీ!

రాజ్యం : నేనుటండీ రాక్షసిని, మీరా? మీ స్వార్థం కోసం మీ రెంత అఘాయిత్యమయినా చేస్తారు. మీరు గొప్ప త్యాగు లనిపించుకోడానికి, కన్నతండ్రిని ఉసురుబెట్టారు. ఇందిరను ఉసురుబెట్టారు. ఇంతవరకూ మీరు ఎవర్నీ ఉద్ధరించలేదు. ఇకముందు కూడ ఎవర్నీ ఉద్ధరించబోరు. మీకు మీ సుఖంకన్నా, ఆనందంకన్నా, కీర్తికన్నా, ఇంకేమీ అవసరం లేదు. వాటికోసం ఎదిరి వాళ్ళను నిలువునా ఖూనీ చెయ్యడాని కూడా మీరు జంకరు. మీలాంటి స్వార్థ పరుడు ఇంతవరకు పుట్టలేదు, ఇక ముందు కూడా పుట్ట బోరు సరేనా?

## Check List

| Book Number | GVP07B156 | Date | 6-11-20 |
|---|---|---|---|
| Front Cover | Yes | Back Cover | Yes |
| Blank Pages | CF, iv, 148, 149 | | |
| Missing Pages | NO | | |
| Prepared | Mounika | Scanned | Mounika |
| BOOK SIZE | H 7.2 W 5 | Pages | 157 |

